శ్రీ వీరరాఘవ గ్రంథావళి :

# మన గురుదేవుడు

(బ్రహ్మముగారి సంక్షిప్త చరిత్ర)

*

"అనధిగతే వేదాన్తే కలిమలకలుషే జనే సదా చరతి
వీరబ్రహ్మాభిధయా సమజని లోకే హి శాంకరం తేజః."

— డాక్టర్ : పుట్టపర్తి నారాయణాచార్యులు

*

దర్శనాచార్య - కళాప్రపూర్ణ

**డాక్టర్: కొండూరు వీరరాఘవాచార్యులు**

**తెనాలి.**

తొలికూర్పు : 1963

మలికూర్పు : 1978 డిసంబరు



ప్రకాశకులు :

కె. ఆనందవర్ధన

చీఫ్ సబ్ఎడిటర్ "ఆంధ్ర ప్రభ"

హైదరాబాద్

ప్రతి. వెల రు. 5-00

ప్రతులకు :

గ్రంథకర్తకు గాంధినగర్, తెనాలి.

గుంటూరు జిల్లా.

ముద్రణము :

సర్వోదయ ప్రింటర్స్,

తెనాలి.

# అభినందనము

"మన గురుదేవుఁడు" (శ్రీ వీరబ్రహ్మేంద్రుని చరిత్రము) అను గ్రంథమును చదివితిని. వీరిని ఆంధ్రలోకము బ్రహ్మంగారని వాడుదురు. శంకరుల తరువాత ఆంధ్రదేశపు పల్లెపల్లెయందున అద్వైతబోధ చేసికొని పోయినవారలలో గురుపదాధిష్ఠితులు వేమన్న, శివరామదీక్షితులు, బ్రహ్మంగారు; వారిశిష్యులు సిద్ధప్ప, ఈశ్వరమ్మ మొదలగువారు. వీరి కాలములోనే కర్ణాటక దేశములో సర్వజ్ఞుఁడు మొదలయినవారు చెప్పుకోఁదగినవారు.

బ్రహ్మంగారిభాష వీరి అందఱిలో కొంచెము వింత గొలుపు రూపకాతిశయోక్తులతో నిండి యుండును. వీనిని తిన్నగా తెలిసికొనుటకు చాలఁ గృషి కావలెను. తెలివిగలవారే బ్రహ్మంగారలయు, వేమన్నగారియు తత్త్వములను, ఆటవెలఁదులను పనికిరాని వాఙ్మయముగా పరిహరించువారున్నారు. అట్టి అపప్రథ పోఁగొట్టుటకు సంప్రదాయ మెఱిఁగిన వ్యాఖ్యాతలు సమర్థులు. అట్టి పనికి పునాదిగా శ్రీ వీరరాఘవాచార్యులుగారు మునిముందు ఈ చరిత్రమును వ్రాసి లోకులకు బ్రహ్మంగారి పరిచయము కలిగించిరి. ఇందులకు వీరిని నే నభినందించుచున్నాను.

చిరివాడ
12-11-62

వేలూరి శివరామశాస్త్రి

# ప్రస్తావన

ఆధునిక మహర్షిమాలకు తొలిపూస అనదగి బ్రహ్మంగారి జీవన వృత్తమును సమీక్షా రూపము "మనగురుదేవుడు" గా శ్రీ వీరరాఘవాచార్యులుగా మనకు అందించిరి. ఇది-ఇతఃపూర్వము వెల్వడిన వివి జీవితచరిత్రలవలెగాక, తజ్జీవిత సందేశమును, లీలల వివర లను సవిమర్శముగా తెలుపు-గ్రంథమైయున్నది. "మే జీబనీ మేరీ బాణీ" అని మహాత్మాజీ అన్నటుల, వీరగురు జీవ చర్యలే సందేశమై, లోకసంగ్రహలీలలై తెనుగునాటి క్రొత్తచైతన్యమును అంటు ద్రొక్కినవి. ఆత్మ, శిల్ప యోగ దర్శనాది రచనల ద్వారానేమి, బహుముఖ ప్రజ్ఞావ్యంజకములగు ఉత్తమవ్యాస పరంపరలద్వారానేమి నైక విషయక వేదికలపై గాంగధారా సదృశోపన్యా ముల వల్లనేమి ఈ కృతికర్త ఆంధ్రుల నుతినీరాజనముల గొన్న మహామనీషి ! ఇట్టివారు వీరగురుని జీవ రహస్యములలోనికి, తమ తత్త్వ పరిణతమైన నిశితదృష్టి సారించి, తత్తత్ నిగూఢ విశేషములను తమకు సహ మైన ఉదాత్త వ్యాఖ్యలతో మనకు నిరూపించిరి.

ఆధ్యాత్మిక తేజమును చిమ్మిన పెక్కురు ప్రవ లున్నను కర్మ, జ్ఞాన, యోగ, రీతులను మేళవించి మతాంతర వ్యాప్తమగు సందేశము నీయజాలినవార మిగుల కొలదిగా ఉన్నారనుట రూఢి.

"శం నో అస్తు ద్విపదే శం చతుష్పదే" అని విశ్వ విశాలసూత్రములను వల్లెవేయుచు, వ్యాఖ్యానవాగ్ఝరులలో శ్రోతలను ముంచుచు, శిష్యుల పూజాసుమవర్షముల స్నాన మాడు వ్యామోహమునను, జగద్గురుపీఠాధికార దంభము నను జిక్కినవారును పెక్కురుండవచ్చును. కాని ఎందరి జీవితములలో, తమ చేతలే నోళ్ళు విప్పుకొని ధర్మశంఖా రావ మొనర్చినవి! ఎంతమంది గిరి కందర తపస్సులచే శుష్కకాయులైరి? ఎందరు పాదయాత్రల జ్ఞానప్రచారము చేసిరి? ఎందరు తేట తెనుగున తమ అనుభూతుల నే గానము చేసిరి? ఎందరు కాయకష్టము సల్పి తనువును కర్మయోగాగ్నిలో తపస్సంశ క్షుత మొనర్చు కొనిరి! ఎందరు విశ్వప్రేమలో కుల మతావధులను విలంఘించి, సమస్త జనతను తమ కూర్మి కౌగిళుల లోనికి గైకొనిరి! ఎందరు తత్ఫలితముగ అశేషజనముచే గాంధీజీ "బాపూ" అనబడినట్లు "జేజి నాన్న" గా ప్రేమింపబడిరి? అంశావ తారములు కొన్ని: పూర్ణావతారములు కొన్ని. కాగా, శ్రీ వీరగురుడు గాంధీవలె ఒక పూర్ణావతారమని నా ప్రగాఢ విశ్వాసము. ఇది శ్రీ వీరరాఘవాచార్యుల వారు నిరూపించిచూపిన బ్రహ్మమూర్తి.

"ఆయన ఎల్ల పీఠాధిపతులవలె తానును అధికార ముద్రను చేదాల్చి ఏల ఊరేగజూడడు?" అని భావగర్భ ముగ 33 వ పుటలో ప్రశ్నించిరి. ఇట్లు త్యాగముతో ఆరంభమై దేశాటనలో, తపశ్చర్యలో-గోపాలనలో-

స్త్రీ, శూద్ర, వివక్షణారహిత మంత్రాద్యుపదేశ విధానములో-ప్రౌఢ వివాహావరణములో - గార్హస్థ్యపావిత్ర్య నిరూపణలో - గ్రామీణశిల్పవృత్తి నిర్వహణములో - విగ్రహారాధన ప్రాథమికావశ్యకతా సూచనలో-హిందూ మహమ్మదీయాదిమతసామరస్య సాధనలో-పుష్పగిర్యాది పీఠసంస్కరణలో - త్రిమూర్త్యంశ విలసనములో-మహావాక్యములను తేట తెనుంగున పాడునేర్పులో-అడుగు అడుగున - వీరగురుని జీవనము ఆధునిక యుగమునకు సందేశ శంఖమును మొరయించి నట్లయినది.

సర్వోపనిషత్ సారమగు గీతను మహాత్ముడు పిలికి అనాసక్తి యోగమును వ్రాసినటుల, సర్వావతారసారమగు వీరగురుని చరిత్రమును శ్రీ రాఘవాచార్యులవారు పిలికి "మన గురుదేవుడు" గా అందించిరి. ఈ విధముగా వీరగురుని చరిత్రక్షీరమును చిలికి, నవనీతఖండమును తీసి ఇచ్చిన శ్రీ ఆచార్యులవారికి ఆంధ్ర ప్రజానీకము ఋణపడినదని నేను భావింతును. తేటతేట తెనుగున-ఈ క్రొత్త వెలుగును ప్రసారముచేసి. బహుముఖ భ్రాజమానమగు ఈ వీరమణియొక్క ధగధగలను మనకు ఈ దర్శనాచార్యులవారు దర్శనీయ మొనర్చిరి.

అల్లదే బ్రహ్మక్షేత్రమున బహుశతాబ్దముల క్రింద పాదుకొన్న విశ్వగురు పారిజాతము. ఇయ్యదే శ్రీరాఘవ సమీరము సంతరించిన నవసౌరభశాలి. ఇక మనము అవ్వారిగా ఆఘ్రాణింతముగాక !

హైదరాబాద్
12-11-62

పులివర్తి శరభాచార్యులు
Retd. D. E. O.

# అంకితము

సీ. అల సనాతన గోత్రు "డాకోజు" శ్రీరాజ
లింగమునకు నాగమాంగనకును
జనియించి ఆహభూన సద్గోత్రుఁడైన శ్రీ
నరసింహమూర్తి విజ్ఞానఖనిని
ఆత్మనాథునిగాఁగ నఁది సత్సంతాన
సౌభాగ్యవతివయి జనులు మెచ్చ
చిట్టిమళ్ళాన్వయ శ్రీ యశోదీప్తము
జ్జ్వలముగా దిక్కుల వెలయఁజేసి
బ్రహ్మగురు పాదనీరజ భ్రమరివై అ
హర్నిశము జ్ఞాన భక్తి యోగాఢ్య వగుచు
పరమపదమును గన్నట్టి భవ్యచరిత
వెంతధన్యాత్మవమ్మ! నీ వీశ్వరమ్మ!

క. బుచ్చమ్మ వేంకటయ్యల
నచ్చిన కోడలవు నీవనన్యాదృతి వా
"రచ్చపుకూఁతురె మా" కని
మెచ్చిరి; యెందే వధూటి మెత్తురె శ్వశురుల్?

శా. జ్యోతి ర్వైదిక వాస్తు శిల్పముల నెంతో నేర్పు సాధించి తా
నేతద్విద్యల శిష్యసంతతికి బోధించెన్ దయాశాలియై;
ప్రీతిన్ దాన మొనర్చె స్వార్జితము, సుశ్రీయుక్తుఁడై బాంధవ
వ్రాతంబున్ దనిపెన్ సపర్యల భవత్ప్రాణేశుఁ డో ఈశ్వరీ!

---

"ఆకోజు" రాజలింగమగారి యింటిపేరు.

శా. ఏతాదృఙ్మహితాన్నదానరతు, విశ్వేశార్చనాశీలు, న
ధ్యేతృ ప్రేమపరైకభాజనుని, సాహిత్య ప్రియంభావుకున్
జేతోనాథునిఁగాఁగఁ బొంది సుగుణ శ్రీధాములన్ బిడ్డలన్
బ్రీతిం గాంచిన నీ పురాసుకృతముం బేర్కొంట సామాన్యమే।

గీ. అగ్రపుత్రుఁడు రామేశ్వరాహ్వయుండు
నాల్గు భాషల విజ్ఞాని, నయవిహారి,
చిత్రకారుఁ డుదారుండు శీలశాలి
హోమియోవైద్యమున కీర్తినొందుసుకృతి.

క. వైద్యాచార్యుఁడు, రోగుల
నుద్యత్ప్రేమమునఁ జూచు నుత్తముఁడు, కళా
విద్యా చతురుఁడు, ధీనిధి
అద్యతన చికిత్సలందు అసమానుండౌ –

గీ. నీదు రెండవ కొమరుండు నీతి వినయ
కలితుఁ డా బాలసూర్యప్రకాశరావు
కీర్తి విస్తారుఁ డార్యానువర్తి యొప్పు
తంద్రికిం దగ్గ సుతుఁడని ధరణి పొగడ.

క. నీ సద్గుణంబు లన్నియు
వాసిగ విద్యలను గూడి వచ్చి వసించెన్
నీ సుత బృందావనమం
దీ సత్యము చెరిగిపోని దీశ్వరి ! యెపుడున్ !

శా. సే వేనాచరణంబె ముక్తి యని యెంతే నాత్మ భావించి, వి
ద్యాపేదార్థిని యయ్యు, కాలమును నీకై త్యాగముం జేసె నో
వీ సత్పుత్రిక బృంద; ఇట్టి సుకృతి న్నే నెచ్చటం గాంచలే
దా సౌజన్యవతీ పరోపకృతు లార్యప్రార్థ్య నీయంబులౌ !

కీ॥ శే॥ చిట్టిమళ్ళ

# నరసింహమూర్తిగారు



శ్రీమ దహాభూన గోత్ర ప్రసిద్ధ శిల్పి
చాత్ర సచ్ఛీలు శాస్త్రవిద్యా వినోద
ఛాత్ర వత్సలుడగు సదాచార్య వర్యుః
చిట్టిమళ్ళవంశ్యుఁ డీ నరసింహమూర్తి

కృతిస్వామిని

నరసింహమూర్తిగారి ధర్మపత్ని

కీ॥ శే॥ ఈశ్వరమ్మగారు



మాననీయురాలు మహిళావతంసంబు
ప్రజలు మెచ్చినట్టి భాగ్యశాలి
బ్రహ్మభక్తి ముక్తి బడసిన పుణ్యాత్మ
ఈమె చిట్టిమళ్ళ ఈశ్వరమ్మ!

సీ. తత్త్వచింతన ముగ్గు ద్రావు శైశవమందె
జీర్ణించె నేమొ నీ చిత్తపీఠ
ఊఁకొట్టు గొట్టుచునుండు బాల్యమునవే
బ్రహ్మమంత్ర జపంబు పట్టువడెనొ
గోరుముద్దల తల్లి కుడుపు కాలమునందె
అనుభవించితొ ఈశ్వరానుభూతి
బొమ్మపెండ్లిండ్లకు పూనిన యప్పుడే
నేర్చితో సత్కార్య నిర్వహణము
కాకయుండినచో నంత్యకాలమందు
బొమల నడుమను ప్రాణంబు పొందుపఱచి
యోగమార్గాన ప్రణవంబు నుచ్చరించు
చవ్యయ బ్రహ్మమును పొందు టరిది కాదె!

ఆ. ఇద్ధమతులఁ గన్న యిల్లాలి వీ వౌట
పతికిఁ గూర్చు ధర్మపత్ని వౌట
బ్రహ్మగురుని భక్తి వండించుకొన్న వ
ద్భక్తురాల వౌట పావనాత్మ!

క. మన గురుదేవుం డను నీ
అనుపమ యోగీంద్రుచరిత మంకిత మిత్తున్:
వినుచుము దీని సుధర్మన్
మనోవిభునిఁ గూడి సురసమాజము మెచ్చన్.

# సవరణలు

| పుట | పంక్తి | ఉన్నది | ఉండవలసినది |
|---|---|---|---|
| 14 | 19 | ప్రమాణమగా | ప్రమాణముగా |
| 18 | 22 | ఊహిచెడు | ఊహించెడు |
| 26 | 4 | సిద్ధిచు | సిద్ధించు |
| 27 | 8 | నమ్మజాలనిదిగ | నమ్మజాలనిదిగను |
| 37 | 2 | అశమే | అంశమే |
| 38 | 1 | నేలమత ను | నేలమతమును |
| 54 | 13 | సంపాదము | సంపాదనము |
| 55 | 20 | మౌల్వీకులకును, | మౌల్వీలకును |
| 77 | 12 | శైవసిద్ధులను | శైవసిద్ధులును, |
| 93 | 13 | అలట్లనుటగాని | అట్లనుటగాని |

# విషయసూచిక

శ్రీమతి చిట్టిమళ్ళ

# బృందావనంగారు M.A.



చిత్ర సాహిత్య కళలందు సిద్ధహస్త
మహిత విద్యైకజీవన మాన్యచరిత
సంఘసేవా పవిత్ర విశాలహృదయ
త్యాగమయి చిట్టిమళ్ళ బృందావనమ్మ !

ఓం

# మన గురుదేవుడు

## అవతారములు

దయామయుడగు పరమేశ్వరుని సృష్టిలీలలు అనంతములే కాదు, అద్భుతములును, అమేయ మహిమాభి శోభితములునై పరగుచున్నవి. అల్పజ్ఞుడును, ఇంద్రియారాముడును అగు మానవుడు సర్వజ్ఞుడును, అతీంద్రియుడును అగు ఈశ్వరుని సృష్టిరహస్యములను తెలిసికొన యత్నించుటయు, కుంఠితశక్తియగు నరుడు సర్వశక్తియగు జగదీశుని జన్మకర్మములను యోచింప పూనుటయు, శరీరాంతర్వర్తియయి పరిమిత శక్తిగల జీవుడు సర్వాంతర్యామియగు సర్వేశ్వరుని మహిమలను అవగాహన చేసికొన దివురుటయు హాస్యాస్పదమేకాదు, సాహసమునై యున్నదని తత్త్వజ్ఞుల అభిప్రాయము. ఆ సృష్టికర్త, ఏ దేశమున, ఏ విధముగా అవతరించి, ఏ విధమగు లౌకికాలౌకిక ధర్మములను సంస్థాపించుచుండునో, ఏ కాలమున ఏ విధమగు సత్యధర్మమును స్థాపించుటకు పుట్టుకలేనివాడయ్యును నిజప్రకృతిని అధిష్ఠించి దివ్యములగు జన్మకర్మములను ధరించునో తెలియుటకు మనుష్యునకుగల జ్ఞానము చాలదు. ఉత్కృష్టమగు మానవప్రజ్ఞను సంయమాగ్నితప్తము చేసి, దివ్యప్రజ్ఞగా దీపింపజేసికొన్న కొందఱు తపస్వులకు మాత్రమే ఆ జగదీశుని మహిమ సముద్రమును కొంతవఱకేని ఈదుటకు సాధ్యమగునేమోకాని, అందఱికి చేతనగు పనిమాత్రము కాదది. ఈ విషయములు, విశ్వస్రష్ట విచిత్రమగు సృష్టి విధానమును ఇంచుక దూరదృష్టితో గమనించిన స్పష్టముకాగలవు.

జగన్నాథుడు స్థలచరములను, జలచరములను, వ్యోమచరములను, ఉభయ చరములను సృష్టించి అనూహ్యామగు తన సృష్టి శిల్పచాతుర్యమును ఎట్లు ప్రకటించియున్నదియు భావించినచో, ఆతనికి దుష్కరమగునది లేదని మానవుడు తెలిసికొని సర్వేశ్వరుని సర్వజ్ఞత్వ, సర్వశక్తిమత్వములకు ఒక్కజోహారు పెట్టగలడు. నానా ప్రాణికోటుల సృష్టి స్థితి లయముల యందు ఈశ్వరుని కళాచాతుర్యము ఎట్లు వ్యక్తమగుచున్నదో, అంతకు వేయిరెట్లెక్కువగా జ్ఞాన విశిష్టమగు మానవసంఘమునను అది ఊహింప నలవికానిదై ఒప్పుచున్నది.

> "అజోఽపి సన్నవ్యయాత్మా, భూతానా మీశ్వరోఽపి సన్
> ప్రకృతిం స్వా మధిష్ఠాయ, సంభవా మ్యాత్మ మాయయా.
> జన్మ కర్మ చ మే దివ్య, మేవం యో వేత్తి తత్త్వతః
> త్యక్త్వా దేహం పునర్జన్మ, నైతి మా మేతి సోఽర్జున."
>
> భగవద్గీత. అ-4 శ్లో-6, 9.

"నేను పుట్టుకలేనివాడనయ్యు, అవ్యయాత్ముడ నయ్యు, సర్వ భూతములకు ఈశ్వరుడనయ్యు నా యోగమాయచే ప్రకృతిని అధిష్ఠించి పుట్టుచున్నాను." ఈ పలుకుల అర్థమును ఇంచుక భావించిన, ఈశ్వరుడు ఎట్లు అవతారమును గైకొను నదియు తెలియును. పరమేశ్వరుడు పుట్టువును గైకొనపన్నను, ఆతని జన్మ కర్మములు ప్రాకృతజీవుల జన్మ కర్మములవంటివి కావనియు, అవి దివ్యములు, అనగా అలౌకికము లనియు "జన్మ కర్మ చ మే దివ్యమ్" అను మాటచే భగవానుడే నుడువు చున్నాడు. స్వల్పమగు మర్త్యశక్తి, దివ్యమగు భగవచ్ఛక్తిని అర్థము చేసికొనవలె నన్నను, అందు ప్రవేశింపవలె నన్నను - అది తన మర్త్య ధర్మమును దాటి అమృతమగు దివ్యధర్మమును పొందవలయును.

మానవుడు ప్రకృతి సంబంధ విషయములచే బద్ధుడై ఉన్నంతవఱకు - పరమేశుని దివ్యత్వముకాని, దివ్యమహిమలుకాని ఆతనికి అర్థములు కావు. అందుకే భ గ వా ను డు స్వయముగా "నా దివ్యము లగు జన్మకర్మముల రహస్యమును ఎఱింగినవాడు శరీరమును విడిచియు, మఱల పుట్టక, శాశ్వతమగు మత్పదమునే పొందును" అని ఘంటా ఘోషముగా పలికినాడు.

"ఈశ్వరుని జన్మకర్మములు దివ్యములే యగును గాక; సర్వశక్తి యగు ఆతడు ఏల సామాన్య జీవులవలె జన్మించి కర్మలు ఒనర్ప వలయును" ? అను ప్రశ్నము రావచ్చును. ఈశ్వరుడు సామాన్యులవలె జన్మ కర్మములను గ్రహించుటలేదు. క్లేశ కర్మ విపాకాశయముల చేత పొదువబడని సర్వస్వతంత్రుడు పుట్టుచున్నాడన్న, కర్మబద్ధుడయి కాదు. లోకకల్యాణము కోసము; ప్రజాసంరక్షణము కొఱకు! ఆయా దేశముల యందు ఆ యా కాలములయందు ఖిలమై లుప్తమైన అవసర ధర్మమును సంస్థాపించుట కొఱకు మాత్రమే. ఈ విషయమును ఈశ్వరుడు భగవద్గీతలో తానే స్వయముగా వచించినాడు—

> "యదా యదా హి ధర్మస్య, గ్లాని ర్భవతి భారత,
> అభ్యుత్థాన మధర్మస్య, తదాఽత్మానం సృజా మ్యహం.
> పరిత్రాణాయ సాధూనాం, వినాశాయ చ దుష్కృతాం
> ధర్మ సంస్థాపనార్థాయ, సంభవామి యుగే యుగే."

"ధర్మమునకు హాని సంభవించినప్పుడు, అధర్మము అభివృద్ధి అయినప్పుడు, సాధు సంరక్షణముకోసమై దుష్టశక్తులను నాశమొందించి, సనాతనమగు ధర్మమను సంస్థాపించు నిమిత్తము ఆత్మమాయచే నేను

అవతారమును స్వీకరింతును." అని చెప్పియుండుటచే - ఈశ్వరుడు స్వశక్తిచే పుట్టి, అలౌకికములగు దివ్యలీలలచే మానవసంఘమును కైవసమొనర్చుకొని, జనులు ఇహలోకమున భద్రజీవనము గడపుచు తన్ను పొందు మార్గములను సూచించియు, ధర్మపద్ధతులను ప్రవచించియు పోవుచుండునని తెలియుచున్నది. ఈ అంశములను ప్రతి - అవతార పురుషునియందును మనము కాంచగల్గుదుము. ఏ మహనీయుడు మానవాతీతములగు శక్తులనుగూడ పిడికిట పట్టి, అత్యద్భుతములగు ఈశ్వర మహిమలను ప్రదర్శించి, విశాల భూప్రజను ఉద్ధరించుటకు పరమ ధర్మములను ఉపదేశించునో, ఎవ్వాని సందేశములు, ఏర్పఱచిన మార్గములు చిరకాలము లోకమునకు భద్రసంధాయకములు కాగలవో అట్టివానిని అవతార పురుషుడని భావించుటకు అభ్యంతరములేదు. దశావతారములే అని కాని, వింశతియే అని కాని వీటికి హద్దులేదు. సృష్ట్యాది నుండి నేటివఱకు ఎన్ని అవతారములు వచ్చినవో, ఏ యే మార్గముల ధర్మసంస్థాపనము జరిగినదో చరిత్ర సంపూర్ణముగా చెప్పజాలదు. ఇంక ఎన్నెన్ని అవతారములు రానున్నవోకూడ ఎవ్వరెఱుంగుదురు! ఈశ్వరాంశము ఎక్కడ స్ఫుటముగా తోచినను, అది అత్యద్భుతమై ప్రకాశింపగలదని భగవానుడే గీతయందలి విభూతియోగమున:—

"యద్య ద్విభూతిమ త్సత్వం, శ్రీమ దూర్జిత మేవ వా
త త్త దేవావగచ్ఛ త్వం, మమ తేజోఽంశ సంభవమ్."

"ఎయ్యది ఐశ్వర్యశోభితమై, శ్రీమంతమై క్రాలునో అదియెల్ల తన తేజోంశముచేతనే అయినదని యెఱుంగుము" అని ఉపదేశించినాడు కదా! అట్టితఱి సాక్షాద్భగవత్కళను ఉద్దేశించి చెప్పవలసినదేముండును!

ఈశ్వరుని ఇచ్ఛాశక్తి అడ్డమాకలు లేనిది. సర్వతః ప్రసారము గల ఆ శక్తిని మానవుడు ఎఱుంగుటకే సమర్థుడు కాదన్నప్పుడు, దాని గమనవిధానమునుగూర్చి "అది అట్లేల జరిగినది? ఇట్లు జరుగ కుండుటకు కారణమేమి?" అని ప్రశ్నించుటకు జనులకు అర్హత లేదు. భక్తిభరితమైన చిత్తముతో ఎవ్వడు తన జ్ఞానశక్తి కొలది ఈశ్వర విలాసమును అర్థము చేసికొన జూచునో, అట్టివానికి మాత్రమే అది భగవదనుగ్రహము కారణముగా అవగతమగు చుండును ఈ అంశమునే ఉపనిషత్తు:—

"యమే వైష వృణుతే తేన లభ్యః,
తస్యైష ఆత్మా వివృణుతే తనూం స్వామ్."

—కఠోపనిషత్తు.

అనుచున్నది. మాయాశబలితమైన పారమేశ్వర తత్త్వమును గ్రహింపవలెనన్న, తొలుదొల్త మాయావరణములను దాటవలయును గనుక, అట్టివాటిని దాటుటకు భగవదేక శరణు డగుట తక్క, మానవునకు గత్యంతరము లేదని "మా మేవ యే ప్రపద్యన్తే మాయా మేతాం తరన్తి తే" అను గీతావాక్యము నుడువుచున్నది. కావున అవతార తత్త్వమును తత్త్వజ్ఞులగు మహనీయులు ఎఱింగి ఉపదేశించిన విధమున మన మర్థము చేసికొనుట యుక్తము. సర్వశక్తియగు భగవానుడు స్వయముగా అవతరింపక, సంకల్పమాత్రము చేతనే అధర్మము నణచి ధర్మపూరణము చేయజాలినను, స్వీయమాయచే అవతరించి, అట్లొనర్చుట లీల. ఆ లీలచేత సాధువులు సంస్కృతులయి తమ ఈశ్వర విశ్వాసమును దృఢపఱచుకొని ముక్తిని చూఱగొనుటకును, దుష్టులు తమ దుష్కర్మముల ఫలమును అనివార్యముగా అనుభవించి

లోకమునకు నీతిపాఠము నేర్పుటకును వీలగుచున్నది. సత్యసంకల్పము ఏ సామాన్యుని హృదయమునందో కలిగినను, దానిచే ధర్మప్రచారము సాగదు. అట్టి సత్య సంకల్పములు సామాన్య మానవుల హృదయములందు అంకురించినయెడల, జనులు వాటిపై విశ్వాసము పూని వాటిని ఆచరించుటకు పూనుకొనరు. ఒక మహోన్నతాభిప్రాయమును వెలువరించు వ్యక్తియు మహాత్ముడై యున్ననేకాని, ఆతని ఆశయములను లోకము మన్నింప జాలదనుట మనకు అనుభవసిద్ధము. అవతార పురుషుడు అతీత వ్యస్త సమస్త శక్తులను కైవసము చేసికొని లోకోత్తరుడై ప్రకాశించును కావున, వాని ఆశయముల ప్రభావము ప్రజా హృదయములపై ప్రభుత్వము నెఱప జాలును. ఈ విధములగు కారణములచేత భగవానుడు సైతము సంకల్ప మాత్రముచే లోకసంగ్రహము చేయక, తన జన్మ కర్మములచేతనే చేయుచున్నాడు. అవాప్త సర్వకాముడయ్యు, తాను ఏ కారణముచే కర్మలొనర్చుచున్నదియు భగవానుడే గీతలలో కర్మ యోగాధ్యాయమున 22, 23, 24 శ్లోకములలో స్పష్ట మొనర్చియున్నాడు —

"న మే పార్థాస్తి కర్తవ్యం, త్రిషు లోకేషు కించన,
నానవాప్త మవాప్తవ్యం, వర్త ఏవ చ కర్మణి.
యది హ్యహం న వర్తేయం, జాతు కర్మణ్యతంద్రితః
మమ వర్త్మానువర్తన్తే, మనుష్యాః పార్థ సర్వశః.
ఉత్సీదేయు రిమే లోకా, న కుర్యాం కర్మ చేదహం,
సంకరస్య చ కర్తా స్యా, ముపహన్యా మిమాః ప్రజాః."

ప్రకృతిబద్ధులు ఆసక్తితో కర్మములను ఒనరింతురు అవతార పురుషులు అనాసక్తులై లోకసంగ్రహార్థము చేయుదురు.

## శ్రీ కృ ష్ణు డు

ప్రతి-అవతారమును ఏ కాలమున, ఏ దేశమున, ఏ విధమగు ధర్మమును పూరింపవలయునో, దానిని పూర్తిచేయుటకే వచ్చుచుండును. ఈ అంశమును గీతోపదేష్టయని ప్రసిద్ధివడసిన కృష్ణుని కాలమునుండియు మనము సుస్పష్టముగ ఎఱుంగుదుము. కృష్ణ చరిత్రమును గమనించిన, అవతార పురుషు డొనర్చు కార్యవిధానములు, దుష్ట నిగ్రహ శిష్ట పరిపాలనములు, ధర్మ సంస్థాపనము, సత్యప్రబోధము తెలియబడగలవు. సృష్ట్యాదిమకాలమున భగవానుడు వివస్వంతునకు ఉపదేశించిన యోగము నష్టమైపోగా, మఱల దానిని ఉద్ధరించి అర్జుననకు ఉపదేశించినా డనుట గీతలో మనము కనుచున్నారము. ఉపనిషత్తులనెడి పాలవెల్లిని మథించి పైకెత్తిన సిద్ధాంతామృతమే కదా గీ తా సా ర ము! వేదాంతములలో గుప్తముగ ఉన్నదానిని సర్వజన సులభము చేయుట గీతాప్రవక్త హృదయము. గీతోక్తధర్మము ఉపనిషత్ప్రతిపాద్యమే అగుటచేత క్రొత్తదికాదు పాలలో లీనమైయున్న నేతినివలె, కృష్ణపరమాత్మ దానిని మథించి బయటికి తీసినాడు. ఏ అవతార పురుషుడైనను క్రొత్తధర్మమును ఉపదేశింప నక్కఱలేదు. వేదోదధియందు మునిగియున్న ఒక్కొక్క ధర్మఖండమును ఎత్తి, ఏ కాలమున దేని ననుసరించి ప్రవర్తించిన మానవసంఘము అభ్యుదయ నిఃశ్రేయసములను అందగలదో, అట్టి ధర్మ ఖండమును లోకమునకు ఎత్తిచూపి, అద్దాని మహిమను చాటి పోవుటకే అవతార పురుషులు, మహాత్ములు ప్రవర్తించుచుందురు. కృష్ణుడు ఉపనిషద్ధేనువునకు గీతామృతదోగ్ధయై పరగినాడు. అంతియేకాదు. స్త్రీ శూద్రాది భేదమును పాటింపక అంతఃకరణముయొక్క సత్వశక్తిని బట్టి జ్ఞానార్హతను, మోక్షయోగ్యతను చూపి మానవసంతరణము సలిపి

నాడు. కృష్ణావతారమున చేసిన ఘనకార్యములు ఇంకెన్నియో చెప్ప వలసినవి కలవు కాని, అందులకిది తావు కాదు. కృష్ణజీవిత మంతయు అలౌకిక దివ్యలీలామయ మని గ్రహింపవలయును. ఈ అంశము ప్రజ్ఞా చక్షువుతో తిలకించిన కాని సత్యమని తోపదు.

## బు ద్ధు డు

కరుణానిరతుడగు బుద్ధదేవుని అవతారముగూడ ఆ కాలమున భారతీయ ప్రజానీకమున పాదుకొనియున్న ప్రాణిహింసక దురాచారమును దూరీకరించి, శాశ్వత శాంతిసుధావృష్టిని కురియుటకే ఏతెంచినదని మనము గమనింపగలము. "బౌద్ధ సిద్ధాంతము వైదికమత భంజకము కాదా" అని ప్రశ్నింపవచ్చును. వైదికముగాని, అవైదికముగాని లోక కల్యాణమునకు తదవతారాగమనము జరిగినదని వైదికసంప్రదాయమును ఒప్పుకొన్నది. ఇందుకు దశావతారములలో బుద్ధుని లెక్కించుటయే ప్రబల ప్రమాణము. ఇకబుద్ధుడు ఆత్మవాదియా? అనాత్మవాదియా? అను అంశములు గూడ ఇక్కడ అనావశ్యకములే. కాని వైదికమతము పేరిట జరుగు దురాచారములను దూరమొనర్చి, మానవ జీవితమును కల్యాణకరమగు శాంతిమార్గమున పయనింప జేయుటకును, ఆచరణ రంగమున విశుద్ధ లౌకిక ధర్మమును ప్రకాశింపజేయుటకొఱకును ఆ మహనీయమూర్తి అవతరించి నాడను వఱకు మనకు ప్రస్తుతము. ఈ అంశమును బుద్ధుని ప్రతిపక్షులును ఒప్పుకొందురు. బుద్ధమత ధర్మ సారము తదనంతరము ఉదయించిన కొందఱు బౌద్ధాచార్యులచే సరిగా అర్థము చేసికొనబడక వికృత మొనర్పబడి కలుషీకృత మైనది. కనుకనే శంకరుల కాలమునాటికి ఆ వికృత బౌద్ధధర్మము ఖండితమయి, బుద్ధుడు నిరాత్మవాది అని తెలియుండవచ్చును. బుద్ధమతాంశములను, తత్ఖండన

మండనములను "ఇది యిట్లు"ని తెల్పుట ప్రకృతము కాదు. కాబట్టి స్థూలముగా ఆ అవతారముయొక్క అక్కఱ లోకమునకు ఏల కలిగెనో విచారింతము.

బుద్ధోదయమునకు పూర్వము హింసాత్మకములగు యజ్ఞములు భూయిష్ఠముగా ప్రచారములో ఉన్నవి. మానవులకు ఈ లోకమున అనుభవించు పార్థివభోగములకన్న, స్వర్గాది పరలోకములయందు అనుభవించు దివ్యభోగములు ఉత్కృష్టములనెడి ఆశ అధికముగానుండి, వాటిని పొందుటకు సాధనములయిన యజ్ఞములను ఆచరించుటయందే వారు రక్తులయిపోయిరి. ఏ యే పారలౌకిక భోగములకు ఏ యే జంతువులను బలిపెట్టవలయునో, ఎట్టియాగ విధానములచే ఏయే ఇహపరలోక ఫలములు సిద్ధించునో, ఆ యా రీతులనెల్ల వేదము ఉపదేశించుచున్నది. నిరంతర వేదాభ్యాస జడులగు ఛాందసులకు తత్ఫలాశ తక్క, వేదాంతముజోలిగాని దాని ఫలమగు నిఃశ్రేయస విషయముగాని పట్టవయ్యెను. ఇంకను 'కుర్వన్నేవేహ కర్మాణి జిజీవిషేత్ శతం సమాః" "అపామ సోమ మమృతా భవేమ" మానవుడు కర్మలను జేయుచునే బ్రతికినంత కాలమును గడపవలయును. సోమపానముచేసి యమృతులము (దేవతలము) కావలయును, అను వేదవచనములయందు ప్రామాణ్య బుద్ధిగల కర్మఠులకు జ్ఞానముగాని, భగవంతుడు, బ్రహ్మపదార్థము అను విషయములుగాని మనసున కెక్కవయ్యెను. వేయేల, ఆనాటివారికి పరలోకమందే ఆశ కాని, ఆత్మదృష్టి, ఆత్మసాక్షాత్కారవాంఛ, జ్ఞానమార్గము శూన్యములని చెప్పవచ్చును. ఆ భావమునే దృఢపఱచుటకు మీమాంసక మతము-పశుబంధన, అగ్నిహోత్రాది కర్మకాండమునకు పట్టాభిషేకము కట్టి నిత్యనైమిత్తిక కామ్య కర్మములే మానవునకు అవశ్యానుష్ఠేయములని, ఆత్మజ్ఞాన శూన్యమై ప్రవర్తిల్లినది. ఇట్టి తరుణమున మానవుని బుద్ధి కర్మబంధురమైపోయి,

శరీర భోగములకు, వాటినిపొందు కర్మములను అనుష్ఠించుటకు ఎంతగా ఉద్రేకించునో చెప్ప నక్కఱ లేదు. పండితుల ఈ వైదిక హింసలేగాక, పామరుల మూఢ విశ్వాసములచే చెలరేగిన గంగానమ్మ, పోలేరమ్మ జాతరలలో జరుగు ఘోర హింసలను ఇనుమడించి యున్నవి. నోరులేని పశ్వాది జంతువులు వేలకొలది యజ్ఞకుండములకు ఆహుతి యగుచున్నవి. పూర్వాచారమనెడి మిషచే అజ్ఞానుల చేతులలోని కఱకు కత్తులకు పెక్కు సాధుమృగములు గుఱియగు చున్నవి. ఇంకను అప్పు డప్పుడే తాఱుమాఱగుచున్న వర్ణవ్యవస్థ పూర్వకాలపు నిర్వచనమునకు దూరమగుచున్నది. గుణములను, నడవడినిబట్టి ఏర్పడవలసిన బ్రాహ్మణాది వర్ణవిభాగము గుణకర్మల ప్రాధాన్యమునకు స్థాన మీయక కేవలము "వారసత్వపు హక్కు"గా భుక్తమగు చున్నది. ఆ యా కులములయందలి వారసులు తమకు కావలసిన అర్హతలు లేకపోయినను నామమాత్రపు యోగ్యతలచేతను, కంటి కగపడు వెలుపలి వేషముచేతను తామే అగ్రవర్ణులమని జనసామాన్యముమీద తమ అధికార దండమును ప్రయోగించుట స్వేచ్ఛగా జరుగుచున్నది. ఈ విధమగు కారణములచే బుద్ధునికి పూర్వమునగల మానవ సమాజము కుళ్ళబాఱ సంసిద్ధమయి, లోకమునకు వెగటు కొల్పుచుండెను. ఇట్టి సమయముననే విశ్వశాంతి దూతయగు బుద్ధదేవుని అవతరణము జరిగినది.

హింసాబహుళమగు ఈ జగములో సిద్ధార్థునికి శాంతి గాని, సౌఖ్యముగాని పొడకట్టలేదు. "మమాత్మా సర్వభూతాత్మా" అని "తన యందు నఖిల భూతములందు నొకభంగి సమహితత్వముతో" ప్రవర్తింప వలసిన మానవాళికి ఈ భోగలాలసత, స్వర్గసుఖవాంఛ, వాటికొఱకై నెఱపు హింసాత్మక ధర్మము నింద్యములని తోచినవి. ఈ చీకటి వరుగు లేల యన్నాడు. జీవహింస స్థానమున సర్వజీవులు అపేక్షించునట్టి

జీవకారుణ్య బీజమునునాటి, ప్రేమ ఫలములను పండింపజేసి దయామృత ధారలను వర్షించినాడు. బాహ్యజీవితమునకు వలసిన శాంతి భద్రతలను పొందు మార్గములను సూచించుటేకాక, నిత్యనిర్వాణము నందునట్టి లోపలి బాటనుగూడ ఏర్పఱచి బుద్ధదేవుడు కల్యాణకరుడై ఒప్పినాడు. "న హింస్యాత్ సర్వాణి భూతాని" అన్న సూత్రమును ప్రచారమొనర్చిన ఆయన అవతారము సార్థకమై ఆ కాలపు మానవ సంఘమునకు తారక మైనది. సమాజములోని క్రుళ్ళు రూపుమాసినది. శాంతి భద్రతలతో నిండిన వ్యవస్థ యేర్పడినది. లోకము కన్నులు తెఱచి—పరోపకారమును, జీవకారుణ్యమును, ఆత్మజ్ఞానమును ఆదరించినది. మూఢ విశ్వాస ప్రేరితములగు కర్మలకు స్వస్తి చెప్పినది. ఆ కాలమునకేకాక, నేటికిని బుద్ధ బోధసుధ లోకమునకు అమరత్వ ప్రదాయిని. కాని, సనాతనమగు బౌద్ధధర్మము పరిక్షీణమై వికృతమగు బౌద్ధ విజ్ఞానముమాత్రము కొంతకు కొంత నేడు నిలిచి యుండుట ధార్మికహృదయములకు విషాదము.

ఏ మతముగాని, ఏ మతాచార్యుల సిద్ధాంతములుగాని వికృతములు కాక, చిరకాలము ప్రచార భూమికయందు నిలిచి పనిచేయ జాలవు. అనుష్ఠానపరులగు మహాత్ములు ఆచార్యస్థానములందు నిలిచి, సిద్ధాంత సూత్రములను స్వయముగ ఆచరించుచు లోకమునకు బోధించుచున్నంత వఱకే వాటిమహిమ ప్రకాశించుచుండును. ఆ యా మతసంప్రదాయజ్ఞులు ఆచరణ హీనులైనను, భోగలాలసులైనను సిద్ధాంతములు తమ ప్రభావ మును ఎట్లు చూపగలవు? అనాచారమనెడి ఈ సూత్రము బౌద్ధ మతమును సంపూర్ణముగా తలక్రిందులు చేసినది. బుద్ధుని అనంతరము చిరకాలమునకు బౌద్ధాచార్యులలో అభిప్రాయభేదములు, ఆచారహీనతలు ప్రబలుచున్న కొలది దానిపై వైదికుల దండయాత్రలు ఎక్కువైనవి. వేదార్థ వేత్తలగు భట్ట, ప్రభాకర, కుమారిలాది మీమాంసక మూర్ధన్యులు

బయలుదేరి బౌద్ధమును పరాభవించి, వైదికమగు కర్మకాండమునకే ప్రాధాన్యమును సంపాదించిరి. నిత్య నైమిత్తిక కామ్య కర్మలవలననే జీవునకు మోక్షము కలుగునను వింత సిద్ధాంతమును కర్మవాదులు బయలు దేరదీసి, జ్ఞానమునకు గాని సన్న్యాసమునకుగాని ప్రాధాన్యము నీయక మఱల లోకమును కర్మబహుళమే ఒనర్చిరి.

ఈ సందర్భమున ఒక అంశము గమనింప తగినదై యున్నది. జ్ఞానోత్పత్తికి సాధనమగు కర్మకలాపము (జ్ఞాన ముత్పద్యతే పుంసాం క్షయా త్పాపస్య కర్మణః) సర్వప్రధానమై శారీరక భోగములను మాత్రము సంపాదించు సాధనముగా పరిణమించినపుడు, అద్దాని పెడ త్రోవను అఱికట్టు నిమిత్తమై బుద్ధరూపమున భగవానుడు అవతరించి, దానిని ఖండించి, సురుచిరమగు ఆత్మజ్ఞాన మార్గమును చాటిపోయినాడు. బుద్ధుని సిద్ధాంతముకూడ సర్వకర్మ రాహిత్యరూపమున పరిణమించి, ఆచరణ రహితమగు వేషమాత్ర సన్న్యాసరూపము నంది, బౌద్ధ విహారములు విలాసమందిరములుగా రూపొందినతఱి, మఱల నిత్యనైమిత్తిక కామ్యరూపమగు వైదిక కర్మసిద్ధాంతము సందుచేసికొని వేరూనినది. అదియే ప్రబలి జ్ఞానహీనమై "కర్మణైవ ముక్తిః" అన్న విపరీత రూపమును గైకొన్నది. తొలుత వికృతమై అతిచేయబడిన యజ్ఞకర్మ సిద్ధాంతమును ఖండించి కర్మసన్న్యాసమును ప్రతిపాదించుటకు బుద్ధావతారము అవసరమై తన ధర్మమును నిర్వర్తించుకొన్నట్లు, తదుపరి వికృతమైన బౌద్ధధర్మమును ఖండించుటకు మీమాంసక (వైదిక) మతము పూనుకొని, అదియు విశుద్ధసత్యమునకు దూరమై, వికృతినే పొందినది వికారము నందిన యీ వైదిక కర్మసిద్ధాంతమును ఖండించి, కర్మము ఆత్మజ్ఞానమునకు సాధనమవి నిరూపించుటకు ఒక్క మహాపురుషుడు కావలసి వచ్చెను. ఆయనయే జగద్గురు బిరుదాంచితుడగు శ్రీ శంకరాచార్యుడు।

## శం క రు డు

శంకరోత్పత్తికి పూర్వము మీమాంసకుల కర్మసిద్ధాంతము, బౌద్ధుల శూన్యాది వాదములు, ఆచారరహితమగు వేషమాత్ర సన్న్యాసము ప్రచారములో నున్నవి. వేదాన్తము (ఉపనిషత్తు) ల యందలి పారమార్థిక సిద్ధాంతములు బహుళముగా ప్రచారములో లేవు గౌడ పాదాచార్యులు, గోవిందభగవత్పాదులు (శంకరుల గురువు) మున్నగు మహనీయులు ఉపనిషత్తులలోని అద్వైత సిద్ధాంత బీ జ ము ల ను అంకురావస్థకు తెచ్చిరి. కాని అవి మీమాంసకుల త్రొక్కుళ్ళకు రూపఱి సిద్ధముగా నున్నవి. ఇంకను ఒకప్రక్క కర్మ సన్న్యాసద్వేషమును ప్రబలి యుండెను. బౌద్ధుల సదాచారహీనమగు సన్న్యాసము లోకమునకు వెగటు పుట్టించుట యొకటి, సహజముగా కర్మపాశబద్ధులగు వేదవాద రతుల కర్మ ప్రవణత రెండవది-ఇవి రెండును కలసి ఆత్మజ్ఞానమును దిగద్రొక్కుచుండెను. ఇట్టితఱి బౌద్ధుల శూన్యాది వాదములను ఖండించు టకును, మీమాంసకుల "కర్మణైవ ముక్తిః" అను సూత్రమును తెగ ద్రెంపి, "జ్ఞానా న్మోక్షః" అను వేదాన్త సత్యసిద్ధాన్తమును సంస్థాపించు టకును, అద్వైవేతేతర మతములను పూర్వపక్ష మొనర్చి సనాతన వేదాన్త సిద్ధాన్తాంకురములను పాదుకొనజేసి ఫలింప జేయుటకును శంకరగురుడు అవతరించినాడు.

శంకరాచార్యుని జీవితఘట్టములో ప్రముఖమైనది విశ్వరూపుని (మండనమిశ్రుని) ఓడించి అతని కర్మపాశములను ఖండించి సన్న్యాసి నొనర్చుట. ఇచ్చటనే పూర్వ మీమాంసావాదము ఓడిపోయినది

> "త మేవం విద్వా నమృత ఇహ భవతి,
> నాన్యః పన్థా విద్యతేఽ యనాయ."
>
> —పురుషసూక్తము.

" ఆ పరమాత్మ నెఱింగిననే ముక్తి కలదు. పరంధామమును జేరుటకు ఇంకొక త్రోవలేదు. ఇందు ఎఱుక (జ్ఞానము) మోక్ష కారణము, అనగా ఆత్మజ్ఞానము ముక్తిహేతువు. అట్టి జ్ఞానము కల్గుటకు, కర్మగాని, భక్తిగాని సాధనములగునేకాని, అయ్యవియే సాక్షాన్మోక్షకారణములు కావు. కావుననే భక్తికర్మలు రెండును జ్ఞానోత్పత్తికి సాధనములు. ఇంకను సర్వకర్మ సన్న్యాస పూర్వకమగు నిర్మల జ్ఞాననిష్ఠ సాక్షాన్మోక్ష సాధనమని చెప్పుటకు "జ్ఞానం లబ్ధ్వా పరాం శాంతిమచిరే ణాధి గచ్ఛతి" "జ్ఞానాగ్నిః సర్వకర్మాణి భస్మసాత్కురుతేఽర్జున" "బహవో జ్ఞానతపసా పూతా మద్భావ మాగతాః" మున్నగు వాక్యములు ప్రమాణములు. శ్రుతిగాని, ఉపనిషత్తులు గాని "ఆత్మనెఱింగి, లేదా భగవానుని దెలిసికొని, బ్రహ్మజ్ఞానమును పడసి మానవుడు ముక్తుడగును" అనుచున్నవి కాని, "ఆ కర్మను చేసికాని, ఈ కర్మ నాచరించి కాని మోక్షమును అందును" అని కర్మయోగమునకు సాక్షాన్మోక్షసాధనత్వమును ఉగ్గడించుట లేదు జ్ఞానసిద్ధి నందుటకు కర్మము సాధనమగునని చెప్పుటయే వేద వేదాన్తముల హృదయము. కేవల కర్మము ముక్తినీయ జాలదు అనుటకు భాగవతములోని "కానని వాని నూతగొని కాననివాడు విశిష్ట వస్తువుల్ గానని భంగి, కర్మములు గైకొని కొందఱు కర్మబద్ధులై గానరు విష్ణుని" అనెడి సూక్తిని కూడ ప్రమాణముగా గైకొనవచ్చును. ఈ విధమగు ప్రమాణ సహితవాద ధోరణితో శంకరులు మండనమిశ్రాది మీమాంసకాగ్రగణ్యులను ఓడించి, బౌద్ధాది శూన్యవాదములను ఖండించి అద్వైత సిద్ధాంతమును, కర్మసన్న్యాసమును సంస్థాపించి, ప్రస్థానత్రయభాష్యకర్తలై బహుళాధ్యాత్మిక గ్రంథకర్తలై కృతకృత్యులైరి. ఇట్టి జ్ఞానజ్యోతిచే కర్మతమస్సులు పటాపంచలైనవి.సదాచారయుక్త సన్న్యాసము సంస్థాపితమైనది. వేదములోని

యజ్ఞప్రణాళికకు జ్ఞానోత్పత్తి పర్యంతము నిష్ఠామాచరణము సిద్ధమైనది. దీనికి తోడుగా శంకరులు తనకు పూర్వము నుండియే ధర్మప్రచారము చేయుచున్నవియు, విశ్వకర్మ తత్త్వప్రతిపాదకములును అగు గాయత్రీ సావిత్రీ సరస్వతీ పీఠములను ఆదర్శముగా గైకొని, శృంగేరి మున్నగు తావుల పీఠముల నెలకొల్పి, వేదాంత ప్రచారమునకు చక్కని సంప్రదాయములను ఏర్పాటు చేసిరి. ఇట్టి సమయమున సురుచిరమగు వైదికధర్మము సుస్థాపితమై మానవ జీవితము సౌఖ్యానంద శాంతులకు నెలవై తేజరిల్లుటకు వసతు లేర్పడినవి. చూచితిరా ! అవతార పురుషులుచేయు ఘనకార్యములు !

## రామానుజాదులు

ఇంతవఱకు సంగ్రహముగా నిరూపించిన కృష్ణ, బుద్ధ, శంకరుల అవతారములకు కారణముగా లోకమున ఏ విధమగు ధార్మగ్లాని సంభవించినదియు, ఆ అవతారపురుషులు ఏయే విధమగు ధర్మమును సంస్థాపించినదియు పాఠకులు అవగాహన చేసికొనియే యుందురు. ధర్మగ్లాని సంభవింపనిది ధర్మసంస్థాపనము చేయుపని భగవంతునను కలుగదు. రోగము లేనప్పుడు వైద్యునితో అక్కఱ యేమి ? వ్యాధి కలిగినపుడు వైద్యుడు వచ్చి రోగమును కుదిర్చి వలసిన బలమును చేకూర్చునట్లు, భగవానుడును అధర్మము పెచ్చు పెరిగినపుడు తాను అవతరించి, ఆ అధర్మమును అణచివేసి, వలసిన ధర్మమును సంస్థాపించి పోవుచుండును. అట్లు సంస్థాపింప బడు ధర్మముకూడ ఏకరూపముగా ఉండ వలయునని నిర్బంధము లేదు. జన సామాన్యమునకు ఎట్టి ధర్మము అవసరమో, ఏ ధర్మమును అనుసరించిన యెడల జనులు భద్రమార్గమున జీవనము నడుపుచు కృతకృత్యులు కాగలరో, ఇంకను ఏ రూపమగు

ధర్మమును ఆచరించు యోగ్యత ప్రజలకుండునో, అట్టి ధర్మ రహస్యము లను మాత్రమే చాటి, ప్రజాహృదయములను ఆ ధర్మములకు అనుకూల ముల నొనర్చి అవతారమూర్తులు నిష్క్రమించుచుందురు. కృష్ణుడు చేసిన పనియే బుద్ధుడు చేయవలయుననిగాని, బుద్ధుడు ఉపదేశించిన ధర్మమే శంకరుడు బోధింపవలయుననికాని నియమము లేదు. రోగనిదానము నెఱింగిన వైద్యుడు దానికి తగిన మందును వాడి రోగశాంతిని గూర్చి రోగితత్త్వమునకు వలసిన పథ్యపానములను ఏర్పఱచి ఆతనికి బలమును చేకూర్చునట్లు, అవతార పురుషులును దేశకాలములకు తగిన ధర్మమును ఉపదేశించి లోకసంగ్రహ మొనర్చుచుందురు. శిష్యుల యోగ్యతలను బట్టి గురువులు వారికి ఆ యా మార్గముల ననుసరించి బోధ సలుపునట్లు, అవతారమూర్తులును లోకస్థితి ననుసరించి ధర్మసంస్థాపనము, ప్రబోధము చేయుచుందురని గ్రహింపవలయును.

శంకరునిచే పునఃప్రతిష్ఠ యొనర్పబడినజ్ఞానము సర్వశ్రేష్ఠమును, ఉపనిషత్ప్రతిపాద్యమును ఐనను, అద్దానిని అనుష్ఠించు యోగ్యత కాల క్రమమున మానవులలో సన్నగిల్లినదని చెప్పక తప్పదు. సన్నగిల్లుటే కాక, కించిజ్ఞుడగు జీవుడే సాక్షాన్నిర్గుణ పరబ్రహ్మమని చెప్పెడి అద్వైత మార్గమునుగూడ సూక్ష్మవిచారముచేతను, సదనుష్ఠానముచేతను ఎఱుంగు శక్తి యెల్లర కుండుట అసంభవమై పోయినది. బ్రహ్మపదార్థము, జగము ఏకమే యనుటయు, జీవుడు బ్రహ్మమునకంటెను వేఱు కాదను టయు సామాన్యలోకమునకు నచ్చినవి కావు. ఇంకను శంకరుని జగన్మాయావాదమును సరియయిన రీతిలో అర్థము చేసికొను శక్తిగూడ లోకమునకు లేకపోయినది. ఇట్టిస్థితిలో జీవుడు ఈశ్వరుని అంశమని చెప్పెడి విశిష్టాద్వైతమును, జీవేశ్వరులకు నియతభేదమును జెప్పు ద్వైతమును జనసామాన్యామోదమునకు పాత్రమలై తత్ప్రవర్తకులచే

ప్రచారమునకు తేబడినవి. ఈ సంస్కారమును జన సామాన్యమునకు కలిగించి భక్తి మార్గమును ప్రచారమునకు తెచ్చుటలో రామానుజాచార్యుడును, మధ్వాచార్యుడును గీతా భాష్యాదులను వ్రాసి కృషిచేసి యున్నారు. రామానుజుడు పరమేశ్వరుని పొందుటకు భక్తి ప్రపత్తులు పరమ సాధనములని నిరూపించి, భక్తియోగముచే ఆధ్యాత్మిక మార్గమును విశాలపఱచి, దాని నెల్లవారలకు తిరుగాడ తగినబాటగా నొనర్చెను.

ఈ సమయమునందైనను శంకరుని అద్వైతమునకు స్థానము లేకపోలేదు. ఉన్నను ఉండవలసినంత లేదు. ప్రతిపక్షుల ఖండనములకు లోనై అది తన రూపును సంకోచపఱచుకొన్నది. తరువాత భాస్కరాచార్యుడును, యాదవప్రకాశులును శంకరుని అద్వైత సిద్ధాంతమునే ఇంచుక భేదముతో బోధించి, అద్వైత సిద్ధికై కృషిసల్పిరి సాయణుడు విద్యారణ్యస్వామియై వేదములకు భాష్యములు వ్రాసియు, 'వేదాన్త పంచదశి" మొదలగు అద్వైతశాస్త్ర గ్రంథములను రచించియు, శాంకర సిద్ధాంతమునకు బలమగు చేయూత నిచ్చియుండెను. ఎవరెంత చేసినను, ఆ చేతలప్రభావము కొంతకాలము పనిచేసినమాట సత్యమే. మతములో అనుష్ఠాన పరులగు మహాత్ములు విరళమగుచున్నకొలదియు మత సూత్రములయెడ ప్రజలకు నిరాదరణము కలిగితీఱునని మనము మఱువ కూడదు. అద్వైత సంప్రదాయముమీద రామానుజాదులు చేసిన దండయాత్రకుతోడు ఆచారహీనులగు వేషమాత్రసన్న్యాసుల వాగాడంబరము సదనుష్ఠానదూరమైన దుష్ప్రవర్తనము అద్వైతముమీదను, అద్వైత సన్న్యాసుల మీదను రోతపుట్టించినవి. సుప్రతిష్ఠితమగు శంకరమార్గము ఖిలమై భోజనానందస్వాములు, భోగానందస్వాములు బయలుదేరి నామమాత్రమున జీవించు పీఠములకు అధిపతులై సనాతనజ్ఞాన సూత్రములను చిక్కుపడజేసి నిరంకుశ పాలన మొనర్చుచుండిరి.

## బ్రహ్మోదయమునకు పూర్వస్థితి

ఇంకను గుణ కర్మ (ప్రవర్తనము) లకు ప్రాధాన్యమీయక జన్మ మాత్రముచే గల్గు జాతికే గౌరవమీయబడుచుండెను. ఉత్తమజ్ఞానమును అనుష్ఠించి మోక్షసంసిద్ధిని పొందుటకు బ్రాహ్మణుడు తక్క తదితరుడు అర్హుడు కాడను దుర్వాదములు చెలరేగెను. జాతిమాత్రముచే జీవించువారి అర్థరహితములు, ఆచారదూరములు అగుమంత్రములు ప్రాధాన్యమును పడయుచుండెను. పవిత్రమును, సార్థకమును అగు వైదికవిద్య కేవలము పొట్టనింపుకొను సాధనమయి, సమాజమునకు మతవిషయకతృప్తినిగాని, జ్ఞాన సంబంధమగు తుష్టిని గాని చేకూర్పక శుష్కమయి పోయెను. దేవుని పేరితో జరుగు మోసములు, దురాక్రమణలు చెలరేగియుండెను. శ్రీకృష్ణుడు ప్రతిపాదించిన జ్ఞాన ప్రధానమగు నిష్కామ కర్మయోగము గాని, వేదవాదుల యజ్ఞకర్మకలాపము గాని, బుద్ధదేవుని జీవ కారుణ్యము, ఆత్మభావము, సామాజిక సమతావ్యవస్థగాని, శంకరుని అద్వైతముగాని, రామానుజుల భక్తిప్రపత్తులు, వర్ణసమైక్యముగాని, విద్యారణ్యుల ఆధ్యాత్మిక దివ్యప్రబోధముగాని యీ కాలపు జనులలో పాదుకొని పనిచేయజాలక పోయినవి. ఇందుకు అనుష్ఠాన పరుడగు మహాపురుషుడు లేకపోవుట ఒక కారణము. ఇట్టితఱి సనాతనములగు వేద వేదాన్తములయందు జనసామాన్యమునకు గౌరవాదరములు తగ్గుటలో వింతయేమి!

ఇంతయే కాదు. మోక్షము నందవలయునన్న గృహస్థాశ్రమమును వీడి సన్న్యాసము పుచ్చుకొని తీఱవలయుననియు, యథార్థమగు సన్న్యాస జీవనమును నిర్వహించుట కష్టతరమనియు ఊహించెడు జనులదృష్టికి గార్హస్థ్యము ఐహిక భోగములకు మాత్రమే ఏర్పడినట్లు తలంపబడి నీరసముగా చూడబడుచుండెను. ఇంతయేల, గృహస్థునికి ముక్తిమార్గము

చాల దూరమును తలంపుగూడ పాదుకొని పోయినదనుట సత్యా మారము కాదు

ఆత్మసాక్షాత్కారమునకు బలవత్తర సాధనమగు అష్టాంగ యోగము (రాజయోగము, లేక పాతంజల యోగము) జ్ఞానప్రధాన వాదులచే ఉపేక్షింపబడి పలుకులలోనే పరమార్థమంతయు ఇమిడ్చి చూపబడుచుండెను. "జీవసమాధి" అణిమాద్యష్టసిద్ధులమాట అటుంచి నను, సామాన్యములును, ముముక్షువులకు అత్యావసరములునగు యమ నియమ ప్రాణాయామాది సాధనములే సాధకులలో కఱవై పోయెను. జాతిమాత్రోపజీవులగు పండితులు, వేషమాత్రోపజీవులగు బైరాగులు కష్ట సాధ్యమగు యోగమునకు ఎట్లు స్థానము చూపగలరు ? ఈ విధముగా సాధకులలో యోగమార్గము పూర్తిగనే నశించిపోయెను.

ఇంకను లోకయాత్ర సాగుటకు ముఖ్య సాధనమును, ఉపాసకుల ఆధ్యాత్మిక జీవనమునకు సోపానమును అగు పవిత్ర శిల్పముపై నిరాదరణము చూపబడినది. శ్రీకృష్ణుని కాలము నుండియు, ద్వారకా నగర నిర్మాణమునందేమి, మయసభా సృష్టియందేమి, ఇంకను నానా విధాస్త్ర శస్త్రముల నిర్మాణమునందేమి, పూజింపబడిన శిల్పవిద్య, వేద ప్రస్తావితులైన విశ్వకర్మ, త్వష్ట, అగ్ని, మిత్రుడు, ఋభువులు, బృహస్పతి, వరుణుడు, భృగువులు, వసిష్ఠుడు మొదలగువారిచే అనుష్ఠింప బడిన పావన శిల్పము, బౌద్ధయుగములో మిన్ను ముట్టిన శిల్పము, యజ్ఞకాలమున యజ్ఞోపకరణములను సిద్ధము చేయుటలో ప్రభుత్వము వడసిన స్థాపత్యము, మతప్రవర్తలయు - మతప్రచారకులయు కాలము లందు అనేక దేవతా-దేవాలయాది నిర్మాణములచేత లోకమును ముగ్ధ పఱచిన శిల్పకళ, పలువురు చక్రవర్తులచేతను రాజులచేతను, సామంతుల చేతను విలాసార్థమేకాక, లోకసంతరణ సాధనముగను మన్ననలువడసిన

శిల్పము ఈ కాలమున ఆదరింపబడకపోవుట దేశదౌర్భాగ్యమునకును, దాస్యమునకును గుఱుతు కాదా? ప్రాచీన శిల్పఋషుల శిల్పసిద్ధాంత రహస్యములు, అవి విశ్వశిల్పియగు భగవానుని చేర్చుటకు ఉపకరించు విధానములు, శిల్పకళా సంప్రదాయములు విస్మరింపబడుటయే కాక, పైపెచ్చు తదనుష్ఠాతలగు శిల్పయోగులమీదను, తజ్జాతిమీదను హేళనలు నిందలుకూడ ప్రబలిపోయెను.

పవిత్రమగు స్థాపత్య (శిల్ప) వేదముయొక్క మహిమ, శిల్ప వాఙ్మయముయొక్క సంస్కృతి జనులకు అగోచరమై యుండెను. శాతవాహనులనాటి ఆనందస్థపతి, నాగార్జునాచార్యుడు, ఇక్ష్వాకులనాటి జయప్రభాచార్యుడు, సమరాంగణ సూత్రధారుడు, భువనదేవాచార్యుడు, ప్రౌఢదేవరాయలనాటి మమ్మనాచార్యుడు, వెంకణ, పురుషోత్తమస్థపతి-మున్నగు మహనీయులుచేసిన శిల్పవిద్యాప్రచారములు గుర్తింపబడవయ్యెను. రామానుజునకు కుడిభుజముగానుండి శిల్పనిర్మాణముచేతి మతప్రచారమునకు చేయూతనిచ్చిన జక్కణాచార్యుడు, "కలియుగ విశ్వకర్మ" యని బిరుదమును బడసిన పదోజు, ఆతని గురువగు బమ్మోజు మున్నగు శిల్పాచార్యుల ప్రతిభను లోకమునకు చాటి శిల్పమహిమ ఇట్టిదని నిరూపించుటకు బొజ్జలు నిమురుకొనుచు భోజనములుచేయు ఆ కాలపు శుష్కపండితులకు ఎట్లు సాధ్యమగును? ఇది అంతయు ఆధ్యాత్మికాభ్యుదయమునకు అడ్డంకి అగుటయేకాక, లౌకికములగు శక్తులనుగూడ కుంఠీభవింపజేసి దేశమును నిర్వీర్యమొనర్చె ననుటలో ఆక్షేపము లేదు నాటి శిల్పులును నిరుత్సాహులై దేశమునకు వలసిన సాధన సామగ్రిని సిద్ధము చేయుటలో ఉపేక్షనే పూనిరి. శిల్పమునకు పాటిల్లిన యీ అవనతి దేశమునకు తీఱని అనర్థమును కలిగించెను.

శైవ వైష్ణవాది మతభేదములు, మతద్వేషములు, కులభేదములు, కులద్వేషములు, ఒక్కొక్క కులమునకు సేవయే తక్క అంతకు మించిన ఉత్తమాధికారము లేదనుట, అది కారణముగా కలహములు చెలరేగి మానవసమాజములో పరస్పర హింసాది క్రూర కార్యములు మెండగుట, ఇద్దానిచే శాంతి దవ్వయిపోవుట, ఉత్తమ జ్ఞానార్థబుద్ధులగు నిమ్నకులులు తమ సమున్నత సంస్కారములను సఫల మొనర్చుకొనబోవ అడ్డగించెడు స్వార్థపరుల కల్పిత స్మృతి సూత్రములు, దేవుని పేరను, సత్కార్యముల పేరను జరిగెడు ఘోరదురాచారములు పెచ్చు పెరిగి, హిందూజాతిని, మతమును బీభత్స మొనర్చుచుండెను.



ఇక ఆ నాటి రాజకీయ పరిస్థితిని తిలకింతమన్నచో, అదియు అధ్వాన్నముగనే యుండెను కటకమునుండి కన్యాకుమారి వఱకును ఏకచ్ఛత్రముగా నేలిన కృష్ణరాయభానుడు అస్తమించుటయు, తదుపరి రామరాజు పరిపాలనముతో విజయనగర సామ్రాజ్యము అంతమొందుటయు సంభవించెను. మహోన్నతమగు ఆంధ్రసామ్రాజ్యము ముక్కముక్కలై ఐకమత్యమునకు దూరమై భారతీయ సంస్కృతికి, ఆంధ్ర సంస్కృతికి తిలోదకము లీయ సిద్ధముగా నుండెను. ఇది అదనుగా ఆంధ్రదేశము మహమ్మదీయ ప్రభువుల వాతబడెను వేద విరుద్ధములగు మతాచారములుకలవారి పరిపాలనములో హిందూజాతిస్థితి ఎట్లుండినదియు, హిందువులు ఎట్టి కడగండ్లకు గుఱియైనదియు ఈ చిన్ని గ్రంథమున వర్ణింప వీలుకాదు. మహమ్మదీయుల విషయమునకూడ హిందువులకు సహనము లేకపోయిననుట సత్యదూరముకాదు. తురకలు మ్లేచ్ఛులనియు, మ్లేచ్ఛుల స్నేహము చేయరానిదనియు, హిందువులుకూడ తురుష్కులను నిందించుచుండిరి. ఈ స్థితిని ఒకకవి ఇట్లు వర్ణించినాడు.

"హిందూజాతి మసీదు నీడలనె గర్హింపంగ, నాత్మామృత
స్యందం బీనెడు వేదధేనువు తరుష్కావేశమున్ రేప, ఆ
డెందాలాఱని కిన్క నిప్పుకల వేడిన్ గ్రమ్మియుంగూడ స్వ
చ్ఛంద ప్రేమరసమ్ములోఁ దడిసి పోఁజాలెన్ ద్వదాదేశమై."

—శ్రీశరభాచార్యులుగారి "రత్నగర్భ."

హిందూదేశమున క్రొత్తగా తావు చేసికొన్న ఇస్లాము మతము పెత్తనములోనున్న ఈ కాలములో మహమ్మదీయ మతప్రవక్తలు స్వమత పక్షపాతముచేత హిందూమతమును తూలనాడి, హిందూ మతములో జనసామాన్యమున వేరూనియున్న 'అవకతవక'' లను బట్టి తమ మత మెక్కుడని ప్రచారము చేసికొనుట, అది హిందువులకు సరిపడక పోవుట, ఇరుకక్ష్యలవారును యుద్ధ సన్నద్ధులగుట తటస్థించి, ఏక కుటుంబముగా ఉండవలసిన మానవసమాజములో హిందూ మహమ్మదీయ భేదముచే చీలిక లేర్పడి రక్తనదులు ప్రవహించుట మొదలగు భయానక వృత్తములకు దేశము స్థానమైనది.

ఈ సమయముననే క్రైస్తవమతముగూడ దేశములో నడుగుపెట్టి తన చిత్రసిద్ధాంతములను నిరూపించుచున్నది. హిందువులు మాల మాదిగలను అంటుకొనకయు, వారిని వెలిబెట్టియు పశువులకంటెను హీనముగా జూచుచుండిరి. దీనిని సందుచేసికొని క్రైస్తవ "ఫాదరులు" అంత్యజులకు ఒకవిధమైన ఆదరమునుజూపి మత మిచ్చి, హిందూ మతమును దుర్బలపఱచు చుండిరి. హిందువుల వీథులలో స్వేచ్ఛగా నడచుటకే నోచుకొనని పంచములకు ఉత్తమమగు దైవచింతనాధికారము ఎక్కడనుండును? ఇట్టి అధికారమును ధనసంపత్తితోగూడ చూపుచున్న క్రైస్తవ మతములో దూఱుటకు వారెంతగా వేగిరపడరు!

ఇట్టి తరుణమున హిందూమతము పూర్తిగా దెబ్బతిని తన స్వరూపమునే కోల్పోయెనన్న ఆశ్చర్యమేమి ? హిందువులకు తమ మతముమీదనా విశ్వాసము తగ్గుచున్నది. అన్యమతాధిక్యమునా ఒప్పుకొనలేరు. తమ జాతియందా అనుష్ఠానపరులగు మతాచార్యులు లేక, కపట నటనా నటకులు మెండై నమ్ముటకు వీలుగాకున్నారు. ఇట్టివారు అన్యమతవాతాహతిచే కొట్టుకొనుచున్న స్వమత జ్యోతిని ఆఱిపోనీయక రక్షింపగలరా ? ఆ జ్యోతియొక్క వెలుగులు వారికి దక్కగలవా ? సంశయము !

ఉంకి పీఠాధిపతు లందమూ, స్వార్థపరులై భోగలాలసులై సంప్రదాయములనే మఱచిపోయి, తామే ఉత్తమ సంస్కార ప్రబోధములనంది ఉజ్జీవనమును అందదగిన వారుగా నుండిరి. ఆత్మోద్ధారకులు కాని వీరు దేశోద్ధారకులు, మతోద్ధారకులు ఎట్లు కాగలరు ? ఇట్టి పరిస్థితిలో ఎన్ని శక్తులనో తననుండి ప్రకాశింప జేయగల మహామహిముడు, సర్వమత సమన్వయమూర్తి, సర్వతంత్ర స్వతంత్రుడు, సర్వజ్ఞుడునగు ఒకొక్క మహనీయమూర్తి అవతరించుట అవసరమైనది. ఆతడు ఎంత మహానుభావుడు కాకున్న ఇంతింతటి క్లిష్టసమస్యలను అన్నింటిని పరిష్కరించి లోకమునకు తారకమార్గము చూపగలడు ! ఒక్కశైవాంశమున పుట్టినవాడు చాలడు. ఒక్క విష్ణ్వవతారము సమర్థము కాదు. ఒక్క బ్రహ్మాంశము ఉపయోగింపదు. త్రిమూర్త్యాత్మకుడు, లేదా - మూర్తి పంచకాత్మకుడునగు విశ్వకర్మభగవానుడే అవతరించి ధర్మసంస్థాపనము చేయవలయును. అందుకే "మూడు మూర్తుల యంశముల నభిన్నత దాల్చి" లీలతో సర్వయోగీశ్వర చక్రవర్తి శ్రీ వీరగురుమూర్తి అవతరించినాడని శ్రీ నిరంజన కవీంద్రుడు పలికినాడు. ఆయన లీలా విశేషములు, అవతారతత్త్వములూ, మాహాత్మ్యములు వాచామగోచరములు; తత్త్వజ్ఞులగువారు వాటిని బహుధా కీర్తించి యున్నారు !!

అవతారవాదమును ఒప్పుకొననివారు సైతము బ్రహ్మగురుడు మహాపురుషు డనుటకును, మహాకార్యములు చేసె ననుటకును సందేహింపరు. సామాన్యవ్యక్తిగా జన్మించినను ఎడతెగని యోగాదులను ఆచరించుటచేతను, నిరంతర కర్మ యోగదీక్షచేతను నరుడు అసాధారణ కార్యములను చేసి, లోకమును ఉద్ధరించుటకును, సమాజమును సంస్కరించుటకును ఆటంకములు ఉండనవసరము లేదు. ఒకానొక వ్యక్తి తన ఆత్మశక్తిచేత మహాకార్యములను చేసియుండుటను గూర్చి చరిత్ర చెప్పుచునే యున్నది. కావున బ్రహ్మముగారును సామాన్య మానవుడు గనే పుట్టి, సమాజ సంస్కారకములు, దేశోద్ధారకములు అగు మహాకార్యములు చేసి, మహాత్ముడయినా డన్నను అయనకు పాటిల్లిన లోటు ఏమియు లేదు. అట్లు తలచువారితోను వీరబ్రహ్మ భక్తులు విరోధింప నవసరము లేదు. మనకు కావలసినది సముచితమగు సమన్వయ మార్గము !

## బ్రహ్మ గురుడు

"అట త్రిమూర్త్యంశ లిమిడి ఐక్యము భజించు;
అట త్రికాలజ్ఞ ధిషణ లాస్యమ్ము సేయు;
అట హిరణ్మయ రోచిస్సు లలలు వాఱు;
"ఏకమేవాద్వితీయ" మా యిద్ధ మూర్తి !

—శ్రీశరభాచార్యులుగారి "రత్నగర్భ"

అనేకులగు అవతారపురుషులయు, మహాపురుషులయు జీవితములను మనము చదివియుందుము. అవతారపురుషులలో రామ కృష్ణాద్యవతారములు పుట్టినప్పటినుండియు అనేకములగు మహామహిమలకును,

అలౌకిక సంఘటనలకును ఆకరము లయినట్లు మనకు తెలియుచున్నది. అందును రామావతారము నందుకన్న, కృష్ణావతారమునందు ఎక్కువగా మహిమలు, లోకాతీత కార్యములు వర్ణింపబడినవి. ఇందుకు కారణము రాముడు మాయాసంవృతుడై వసిష్ఠాదుల ప్రబోధముచే తెలివి నందిన వ్యక్తి యగుటయు, కృష్ణుడు పుట్టినప్పటి నుండియు అలౌకిక దివ్య స్వభావమును ప్రదర్శించిన గీతోపదేష్టయగు నుత్తమాచార్యు డగుటయు నని చెప్పుచుందురు. అనగా రామునిలో దివ్యత్వ మనుష్యత్వములు కలసి యున్నవనియు, కృష్ణునిలో కేవల దివ్యత్వమే మూర్తీభవించిన దనియును తత్త్వజ్ఞుల వ్యాఖ్యానము. కావుననే-రామచంద్రుడు మనుష్య స్వభావమునకు సన్నిహితు డగుటవలననే ప్రతిమానవుడును రామమూర్తి వలె నడచుకొనవలయుననియు, కృష్ణునివలె నడచుకొనక ఆతని ఉప దేశములను అనుసరింప వలయుననియు "రాముడు చేసినట్లును, కృష్ణుడు చెప్పినట్లును ప్రవర్తించిన మానవుడు ఇహ పరముల సాధింపజాలు"నని చెప్పుచుందురు. రామచంద్రుని వంటి ఆదర్శమానవుడు దుర్లభుడు. ఆతని కుటుంబమువంటి ఆదర్శకుటుంబముకూడ సుదుర్లభము.

బుద్ధావతారములో కృష్ణుని జీవితమునందలి మహిమలు కాని అలౌకిక సంఘటనలుకాని, అంతగా నున్నట్లు తోచదు. అట్టివి లేకున్న ఆతడు అవతారమూర్తి కాజాలడని, తరువాతివారు బుద్ధుని జీవితమును కూడ మహిమలకు పుట్టినిల్లుగా చేసినట్లు పలుగ్రంథములు చాటుచున్నవి. ఇదియును కొంతసత్యము కావచ్చునుగాని, బాల్యమునుండియు మహిమల తోడను, అణిమాది సిద్ధులతోడను నిండినట్టి భక్తులయు, సిద్ధపురుషులయు జీవితములు పెక్కులు మనకు పరిచితము లగుటచేత, మ హి మ లు కేవలము కల్పితములని త్రోసివేయ జాలకున్నాము. ఈ మహిమలను, సిద్ధులనుగూర్చి యోగశాస్త్రములో ఇట్లు కన్పట్టుచున్నది.

"జన్మౌషధి మంత్ర తప స్సమాధిజా స్సిద్ధయః"

—పాతంజల యోగసూత్రము.

అణిమాది సిద్ధులు కొందఱికి జన్మముచేతను, కొందఱికి మంత్రములచేతను, తపస్సుచేతను, సమాధి (యోగము) చేతను సిద్ధించునని పై సూత్రము చెప్పుచున్నది. కాని అవతారపురుషుల విషయమునను, పూర్వజన్మమునందే యోగసిద్ధిని పొందినవారి విషయమునను పుట్టినప్పటి నుండియే సిద్ధులు కల్గుచుండుననుట సత్యము.

సిద్ధులగు వారివిషయ మటుంచినను, స్వప్రయత్నము చేతను, చిన్నప్పటినుండి చేసిన సాధనముచేతను కృతకృత్యులయి లోకమునకు దివ్యసందేశముల నిచ్చి, తాము చూపిన మార్గములందు జనతను నడపించిన మహావ్యక్తులనుకూడ పలువురను మన మెఱుంగుదుము. ఇట్టి వీరిని మహాపురుషులని వాకొనునుటకు అభ్యంతర ముండదు వీరి జీవితములందు అలౌకిక సంఘటనలు, సిద్ధులు, మహిమలు అఱుదుగా గన్పట్టుచుండును. పరమేశ్వరుని కృపావిశేషమును బట్టి, అవసరము ననుసరించి అవి కలుగుచుండునేమో కాని, బాల్యమునుండియు అవ్వాని యునికి కన్పట్టదు.

రెండు తెఱంగులుగా నున్న వీరి జీవితరీతులనుబట్టి చూచిన మన కథానాయకుని మనుగడ మొదటి తరగతికే చెందుచున్నది. వీర బ్రహ్మేశ్వరస్వామి జీవితములో పుట్టుక దగ్గఱనుండి సమాధి పర్యంతమును లోకోత్తరములగు మహిమలను, అలౌకిక దివ్య సంఘటనములను, అతిలోకములగు సిద్ధులను మనము చూడగల్గుదుము. ఇందు కొన్ని కల్పితములని యెత్తివేసినను, త్రోసిపుచ్చరాని ప్రమాణములతోడను, ఆధారములతోడను కూడియున్నట్టివి ఎన్నియో మహిమలు, అలౌకిక

కార్యములు మనకు గోచరించు చున్నవి. ఆ కారణముచేత కృష్ణ జీవితమునువలె వీరగురుని జీవితమునుగూడ మహిమల ప్రదర్శన విషయమున నేటి లోకము విశ్వసించుటలో ముందంజ వేయజాలదేమో! భక్తలోకమునకును, ఉత్తమ జిజ్ఞాసువులకును ఇది ఆశ్చర్యకరము కాదు గాని, నవ నాగరికతా వాసితులకు మాత్రము దురవగాహమే.

అట్టివానిలో మొట్టమొదటిది వీరదేశికుడు అయోనిసంభవు డనుట. మనుజుడు అయోని సంభవు డగునను విషయము ఊహ కందనిదిగను, నమ్మజాలనిదిగ తోచును. ఏ అవతారపురుషుని విషయమునను అయోని సంభవుడగుటను మనము వినలేదు. అయినను పలువురు పెద్దలు ఈ మహావ్యక్తి అయోనిసంభవు డనుటలో గాఢమగు విశ్వాసమునే కలిగి యున్నారు కవిశేఖర వడ్డెపాటి నిరంజనశాస్త్రిగారు "శూన్యోత్పత్తిం దత్త మత్రే ర్మహర్షేః" అనియు, "తలిదండ్రు లెవ్వరో తెలియకుండ స్వయంభు వైనవాడీ చిన్ని యర్భకుండు" అనియు గానము చేసి యున్నారు. శ్రీ శాస్త్రిగారు ప్రమాణములేని మాటను పలుకరు. శుక మహర్షి అయోని సంభవుడని పురాణవాఙ్మయము చెప్పుచున్నది. అట్లే బ్రహ్మయోగియు అయోని సంభవు డగుటయందు ఆశ్చర్యము లేదని శ్రీ శాస్త్రివర్యులు తలంచి యుందురు. శుకజన్మ ప్రకారమును అనుస రించిన శాస్త్రిగారి దృష్టినిబట్టి గురుదేవుని అయోనిజత్వము అయుక్త మనుటకు వీలు లేదు కదా!

యోనిసంభవు డనుటకును ఆధారములు లేకపోలేదు. సంతానార్థు లగు విశ్వబ్రాహ్మణ దంపతులు కాశీ మున్నగు పుణ్యక్షేత్రములను తిరుగు చుండ కొంతకాలమునకు ఆ గృహిణి గర్భవతియై సరస్వతీనదీ తీరమున

నున్న * అత్రిమహర్షి యాశ్రమ సమీపమున ప్రసవించె ననియు, ప్రసవించిన మఱుక్షణముననే బాలకుని తండ్రి చనిపోవుటచే ఆ పతివ్రతా తిలకము ఆ శిశువును అత్రిమహర్షి కప్పగించి తానును భర్త ననుగమించెననియు, ఈబాలకుని పాపాగ్ని పీఠాధిపతులగు వీరభోజయాచార్యుల వారి కప్పగించునప్పుడు అత్రిముని చెప్పెను. దీనినిబట్టి చూచిన వీరగురుడు అయోనిసంభవుడు కాడని తేటతెల్లమగు చున్నది. వీరగురు భక్తపరంపరలోను, వేదాన్త సంప్రదాయజ్ఞులలోను పలువురు ఈ రెండవ మతమునే అంగీకరించి యున్నారు.

## శై శ వ ము

గురుదేవుడు శైశవమున వీరనారాయణ, వీరప్ప అను ముద్దు పేరులతో సరస్వతీ నదీతీరమున నున్న అత్రి మునీంద్రుని ఆశ్రమమున అనేక లీలలు ప్రదర్శించెను. అయిదాఱు వత్సరముల ప్రాయము కలవాడయ్యు "అంభోజ గర్భాదు లభ్యసింపగలేని" అనన్య సాధ్యమగు అతీంద్రియ యోగమార్గమువలన పరబ్రహ్మముయొక్క సాకార నిరాకారములను సందర్శించి, తన తత్త్వజ్ఞత్వమును చాటెను. అనుపనీతుడగు ఆ చిఱుపాపయొక్క అద్భుతానుభవములకు సాధకావస్థలోనున్న అత్రి అచ్చెరువుపడి అతనికారణజన్మతను తెలిసికొని,అజన్మ బ్రహ్మవేత్తయగు ఆ కుఱ్ఱడు లోకోద్ధరణమునకై జనించిన మహావ్యక్తియని గ్రహించును. వీరగురుని అవతారము వేదోద్ధరణము, శిల్పోద్ధరణముకూడ నొనరించుటకు కలిగినది కావున, ఆ శైశవక్రీడలయందే అతడు వేదాన్తప్రజ్ఞతో పాటు శిల్పకళా కౌశలమును కూడ లోకోత్తరముగా ప్రకటించు చుండెడి

---

* ఈ అత్రిముని సప్తఋషులలోనివాడు కాడు. ఆ పేరుగల మఱియొక మునీంద్రుడు.

వాడు. ఆతని ఆటవస్తువు లన్నియు స్వశక్తిచేతనే స్వయముగా కల్పింప బడుచుండెడివి. ఇట్టి పట్టుల "ఇతడు మానవరూపమును తాల్చిన ఆది విశ్వకర్మయా" అని మహర్షి ఆశ్చర్యమంది తనశిష్యులకు అవ్వాని మహిమలను ఉగ్గడించు చుండెడువాడు.

వీరనారాయణుడు అత్రిమున్యాశ్రమమున శైశవలీలలను చూపు చున్న సమయమునందే నందికొండయందలి * పాపాగ్ని పీఠాధిపతులగు వీరభోజాచార్యులును శ్రీవారి ధర్మపత్ని వీరపాపమ్మయు సంతానార్థులయి నానాపుణ్య తీర్థములందు పర్యటించుచుండిరి. ఉత్తమ వ్రతులై వైదిక ధర్మమార్గమున పాపాగ్ని పీఠాధ్యక్షత వహించి ప్రజాపాలనము సేయు వీరికి సంతానము లేదయ్యెను ఆ కొఱంతను పాపుకొనుటకై తపస్సులు, దానములు సేయుచు, శ్రీశైలాది పుణ్యక్షేత్రములను సేవించుచు తుదకు జగన్నాథమును జేరి ఆ దేవుని అర్చించి, అటుపంకి సరస్వతీ తీరమున నున్న అత్రి మునీంద్రునికడకు చేరుకొనిరి. అత్రిమహర్షియు ఆ పుణ్య దంపతుల సచ్చరిత్రమును గ్రహించి అవ్వారి ప్రార్థన ననుసరించి తనవద్ద నున్న వీరనారాయణ యను ఈ బాలుని ఆ దంపతుల కర్పించి, యవ్వాని జన్మవృత్తాంతమును సాంగోపాంగముగా వివరించి చెప్పెను. ఇంకను అద్భుత ప్రభావ సంపన్నుడగు ఈ బాలుడు మనుష్యమాత్రుడు కాడనియు లోకోత్తర చరిత్ర కలిగి, లోకమును ఉద్ధరింప బుట్టిన మహాపురుషుడు కావున, ఇట్టి కారణజన్ముని ఆధిపత్యమున పాపాగ్నిమఠము పాపమున కగ్నియేయై పుణ్యఫలములను పండించి ప్రజాసంతరణము చేయగలదని ఆనతి ఇచ్చి పంపెను.

పాపాగ్ని మఠాధిపతులగు ఆదంపతు లిరువురును స్వస్థానమున కేతెంచి పిల్లవానిని అల్లారుముద్దుగా పెంచుచు "బ్రహ్మవర్చస కామస్య

---

* ఈ పీఠమునకు పాపఘ్ని పీఠమనికూడ నామాంతర మున్నది.

కార్యం విప్రస్య పంచమే" (బ్రహ్మ వర్చస్సునుగోరు విప్రునికి అయిదవ యేట ఉపనయనము చేయవలయును) అను మనువచన ప్రకారము ఆ బాలునకు ఒక్క శుభముహూర్తమున ఉపనయనము కావించి వేద శాస్త్రాదులను జదివింపజేసిరి. సహజజ్ఞాన విలాసుడగు నాతనికి వేద శాస్త్ర విజ్ఞాన మేమి కష్టము ! అచిరకాలముననే సర్వవిద్యలయందును సర్వకళలయందును కుశలుడై త్వష్టపుత్రుడగు విశ్వరూపుడో యన ఆ బాలుడు తేజరిల్లుచుండెను.

వీరనారాయణ, వీరభోజాచార్యులకు దత్తపుత్రుడయిన పిమ్మట వీరంభట్లు, వీరంభట్లయ్య అనెడి పేళ్లతో విలసిల్లుచుండెను. ఇట్లు కొంత కాలము గడచిన యావల వీరభోజయాచార్యులు పరమపదము నలంకరించెను. మహాపతివ్రతా శిరోమణి యగు వీరపాపమ్మ భర్తృదేవుని అనుసరింప దలంచియు కుమారుని పాలన పోషణములకు తగువారు లేమింజేసియు, ఆ యర్భకుని తెలివితేటలకు, విద్యావివేకములకు తగిన చేయూత తానే యగుట వలనను భర్తృ మరణ దుఃఖమును దిగమ్రింగి జీవించియేయుండి ఆ బాలకుని అభ్యుదయమును ఆకాంక్షించు చుండెను. "రత్నం సమాగచ్ఛతు కాంచనేన" అన్నట్లు సహజముగా మహాపురుషుడగు వ్యక్తికి అనుకూలములగు దేశ కాల వస్తువులు, పరిసరములు చేకూరిన ఆత డెంతగా శోభింపడు ! అష్టాంగ యోగాభ్యాసమునకు, తపశ్చర్యకు అనుకూలమగు మఠ నివాసముచేత వీరంభట్లయ్య గారి ఆధ్యాత్మిక సాధనలు, యోగానుష్ఠానములు వసంతకాలమున వృక్షములవలె చిగురించినవి.

## తపస్సు

వీరంభట్లయ్య పదిరెండేండ్లవా డయిన తరువాత, మాతృసంఘమునకు ఆదర్శప్రాయ యగు తల్లిని సమీపించి "అమ్మా ! నేను కొంత

కాలము తపోవృత్తితో కాలము గడపదలచి యున్నాను. తపస్సునకు గిరికందరారణ్య ప్రదేశములు ఉచితములయినవి. అనంతరము నానా దేశసంచారము చేసి ఆ యా పుణ్యతీర్థములందు సంచరించు నిచ్ఛయు గలదు. కావున నాకు సెలవిచ్చినచో, నా ధర్మమును నిర్వహింప నేగుదును." అని అడిగెను. అందులకా ప్రియమాత ఉలికిపడి "కుమారా! ద్వాదశ వర్షప్రాయుడవగు నీ వేడ? మహాయోగి దుర్లభమగు తపశ్చర్య యేడ? అందును పర్వత గుహాలయందు తపమా? అరణ్య సంచరణమా? ఇందులకు నే నంగీకరింపజాలను పవిత్రమును, ప్రశాంతమును అగు మఠమునకన్న నీకు తపోఽనుష్ఠాన యోగ్యప్రదేశ మెక్కడ లభించును? కావున నీతలంపును మార్చుకొని మన మఠము నందే తపశ్చర్య నిర్వహింతువు గాక! దేశసంచారమన్న, ఇప్పుడే చేయవలసిన యక్కఱయేమి? అది యెప్పుడేని చేయవచ్చును." అనెను. అందుకా బాలుడు "తల్లీ! నీవు పుత్రమోహలాలసవై యిట్లాడుచున్నావు గాని నా శక్తి సామర్థ్యములను, వాటిని ఇనుమడింపజేయు సత్య సంకల్పమును ఎఱింగి పల్కుటలేదు. నేను బాలుడనని నీవు భయుంపడ నక్కఱలేదు. విశ్వకర్మ భగవానుని అనుగ్రహముచేత నాకు పర్వత కందరములైనను ప్రాసాదరాజములు కాగలవు. మహారణ్యము లయినను లీలోద్యానము లగును. సింహశార్దూలాది ఘాతుకమృగములును ప్రియ మిత్రములై పరిచర్య చేయును. కావున ప్రాణి సహజమగు మోహ పాశమును తెగద్రెంపి, నా గమనమునకు ఇయ్యకొనుము." అని పలు మాఱు ప్రార్థించెను.

అందులకు వీరపాపమ దుఃఖసంతప్త చిత్తయై "నాయనా! ఏ నీ లీలలను చూచి మీ తండ్రిగారి మరణ దుఃఖమునుగూడ దిగమ్రింగితినో, ఏ నీవు పీఠాధిపతివై ధర్మప్రచారము సల్పుదువని ఆశించితినో, అట్టి

నిన్ను వదలుకొనజాలను. వేఱొకచోట నీవుండుటకు అంగీకరింప జాలను. నీవు ఈ పీఠమునకు అధిపతివై రాజువలె ధర్మముగా శిష్య పాలనము చేయుము. మతము నాశ్రయించినవారి పూజాపురస్కారము లను అందుకొనుము. మనకు పలువిధములగు కానుకలు, కట్నములు లభింపగలవు. ఏ కొఱంతయు లేక హాయిగా కాలమును వెళ్లబుచ్చెదము." అని యెను.

అందులకు వీరంభట్లయ్య "తల్లీ ! అట్లనకుము. "ఉదార చరితానాం తు వసుధైవ కుటుంబకమ్" అని వినలేదా ? భూమండల మునందంతటను పర్యటించి, ధర్మోపదేశము లొనర్చి, సాధుసంతరణము చేసి మానవమండలికి కల్యాణమును సంపాదింపనెంచు నాకు ఈ గృహ నివాసము ఎంతటిది ? నిజధర్మమును కోల్పోయి, లోకులచే గర్హింప బడుచు సనాతన ధర్మమునకు తలవంపులు చేకూర్చుచున్న పీఠములను సంస్కరింపనున్న నాకు ఈ ఒక్క పీఠమునే అంటిపట్టుకొని యుండుట ఉచితమా ? సర్వమానవ సంఘములను సంసేవించి, వారిపూజా పుర స్కారములను అందవలసిన నాకు ఒక్క మతమువారి మన్ననలను మాత్రమే కైకొనుట కర్తవ్యమా ? పాపాగ్ని పీఠాధిపత్యమునకు ఎవ్వరినేని నియోగింపుము. నాకు సెలవిమ్ము. ప్రాకృత సంబంధమగు నీ పుత్ర మోహమును పటాపంచలు చేయుము. నా పితృపాదులు ఉపదేశించిన ఆధ్యాత్మిక జ్ఞానమును అనుసరింపుము. మైత్రేయివలె "ఆత్మయే ద్రష్టవ్యము, శ్రోతవ్యము, మంతవ్యము, నిధిధ్యాసితవ్యము" అని యెఱుంగుము. పూర్ణయోగమును అనుష్ఠింపుము. ఏల బేలవయ్యె దవు ? ఈశ్వరుడు భక్తుల కర్తవ్యములను తానే నిర్వహింపగలడని విశ్వాసము పూనలేవా ? పిచ్చితల్లీ! ధ్రువ ప్రహ్లాదాదులు బాలురు కారా దుష్కరమగు తపశ్చర్యకును, కష్టసహిష్ణుతకును వారు వెనుకంజ

వేసిరా ? అట్టి వృత్తాంతముల నెఱింగిన నీవు ఏల సందియ పడెదవు ? కావున నన్నాశీర్వదించి పంపు'' మని ప్రార్థించి తత్త్వ బోధముచేత ఆమె యజ్ఞానపు పొరను తొలగించి, ఆ పరమసాధ్వి రత్నము చే మేల్మిదీవనలను పడసి మన వీరంభట్లయ్య పాపాగ్ని మఠమునుండి పయన మాయెను.

వీర యోగీంద్రుని జీవితములో ఎన్నదగిన ముఖ్యాంశములలో ఇది యొకటి. ఈతడు సామాన్య విద్యాబుద్ధి వివేకములు గల వ్యక్తిమాత్రుడే అయిన యెడల అయాచితముగ లభించిన పీఠాధిపత్యమును చేజేత పోగొట్టుకొనునా ? ఎల్లపీఠాధిపతులవలె తానును అధికార ముద్రను చేత దాల్చి ఊరేగ జూడడా ? ఆ త ని భావిలక్ష్యము, భవిష్యత్కర్తవ్య నిర్వహణము ఆతనికితోచియుండుటచేతనే లోకోత్తరమగుతత్త్వబోధము చేత తల్లిని సమాధానపఱచి - సమాధాన పఱచుటయే కాదు, ఆమెకు సంతరణ మార్గమునుకూడ ఉ ప దే శిం చి, దుఃఖదూరురాలినొనర్చి తపోఽనుష్ఠానమునకును, దేశ సంచారమునకును బయల్వెడలెను

వీరగురుడు ఈ ప్రకారము బయల్వెడలి దక్షిణ దేశమునందలి రామేశ్వరమున కేగి అందలి భక్తులకును, యోగులకును, ముముక్షువులకును అనేక సదుపదేశము లొనర్చి, ధనుష్కోటి, చిదంబరము మున్నగు పుణ్యక్షేత్రములందు తిరుగాడుచు, అందందుకల మానవ సంఘములను, సాధుబృందములను జానుతెనుగునగల తన వేదాంత వాక్య సమూహముచే ప్రబోధించుచు భక్తి జ్ఞాన కర్మయోగములను ప్రచారము చేసెను. కొంతకాలమిట్లు గడపి తుదకు హరిహర పురమునకు వచ్చి అందలి విశేషములను అరసి యుక్తమగు నొక పుణ్యప్రదేశమున తపోదీక్ష వహించి, నియమకృశదేహు డగుచు, కఠోరతప మాచరించెను.

వీరగురుని దేశాటనము మానవుడైనవాడు విద్యాబుద్ధులు సంపాదించి, నానాదేశములందు పర్యటనము సల్పి తా నెఱింగిన జ్ఞానమును ప్రచారము చేయవలయుననియు, తనకు తెలియని అంశములను ఎఱుంగవలయుననియు వ్యక్తమొనర్చు చున్నది కదా!

మనుజుని మహిమను, శక్తిని ఇనుమడింపజేయు సాధనములలో తపస్సు ఒక్కటి. అతీంద్రియార్థములనుకూడ సుప్రత్యక్ష మొనర్చుటకును, మర్త్య ధర్మములో నుండిన మానవుని దివ్యధర్మములోనికి ఉద్ధరించుటకును తపమువంటి గరిష్ఠ సాధనము వేఱొకటి లేదు. ప్రాచీనులగు మహర్షులు తపోఽనుష్ఠానముచేతనే లౌకికాలౌకిక ధర్మములను ఎఱింగి ఆత్మజీవితమునే గాక, లోక జీవితమును కూడ సంతరింపజేయ గల్గిరి. పుటము పెట్టుటచేత బంగారము మేల్మియై తేజరిల్లునట్లు, ఉత్తమ సంయమముతో కూడిన తపస్సుచేత అంతఃకరణముకూడ విశుద్ధమయి, బ్రహ్మసాక్షాత్కార యోగ్యస్థితి నందును. కావుననే వరుణ భగవానుడు బ్రహ్మోపదేశము చేయుమని తన్ను ప్రార్థించిన ప్రియసుతుడగు భృగువునకు "తపస్సుచే బ్రహ్మమును జిజ్ఞాస యొనర్పుము'' (తపసా బ్రహ్మ విజిజ్ఞాసస్వ) అని బోధించి యున్నాడు. గరిష్ఠమగు తపముయొక్క ప్రభావము నెఱింగియుండిన వీరగురుడు ఈ తపశ్చర్యచేత ఒక ఉత్తమాదర్శమును అనుష్ఠించి లోకమునకు పాఠము నేర్పియున్నాడు. తపః ప్రభావమును ముండకోపనిషత్తు ఇట్లు వక్కాణించుచున్నది.

> "తపః శ్రద్ధే యే హ్యుపవసన్త్యరణ్యే
> శాన్తా విద్వాంసో భైక్షచర్యాం చరన్తః,
> సూర్యద్వారేణ తే విరజాః ప్రయాన్తి
> యత్రామృతః స పురుషో హ్యవ్యయాత్మా."

"ఇంద్రియ విషయములకు లోబడనివారై నిర్జన ప్రదేశములందుండి తపశ్శ్రద్ధలను అనుష్ఠించు జ్ఞానులు సూర్యద్వారమున తమ పుణ్య పాపరూప కర్మములు నశించిపోగా అవ్యయుడు, అమృతుడునగు పరమ పురుషుడుండు పదమును పొందగలుగుచున్నారు."

## బనగానపల్లె నివాసము

వీరదేశికుని జీవితములో పేర్కొనదగిన అంశములలో శ్రీమతి గరిమరెడ్డి అచ్చమాంబ గారియింట ఆతడు సేవకవృత్తితో నడపిన లీలా విశేషము మఱియొకటి. వీరంభట్లయ్య హరిహరపురములో తపోవృత్తి యందు ఉన్నప్పుడు కాశీపుర నివాసియగు ఆనందభైరవయోగి అను నొక క్షత్రియుడువచ్చి-ఆ గురునిచేత యోగరహస్యములను,మంత్రవిశేషములను తెలిసికొని పోయెను తరువాత గురుడు ఉత్తరదేశమున పర్యటించు నుత్సాహముతో కాశి, ప్రయాగ మున్నగు క్షేత్రములందు తిరిగి అచ్చ టచ్చటకల భక్తులకు ముముక్షువులకు తత్త్వరహస్యములను చాటుచు, కాలజ్ఞాన విశేషములను ఉగ్గడించుచు, మఱలివచ్చి - శ్రీశైలము, మహా నంది, యాగంటి మున్నగు పుణ్యస్థలములను దర్శించి విజ్ఞానప్రచారము చేయుచు కడకు బనగానపల్లె చేరెను.

బనగానపల్లెలో సుప్రసిద్ధమగు కాపుకుటుంబము శ్రీ గరిమరెడ్డి వేంకటరెడ్డిగారిది వేంకటరెడ్డిభార్య అచ్చమాంబ పరమసాధ్వి; అతిథ్య భ్యాగతులను అర్చించుటయందు ఆసక్తిగల ఉత్తమాంగన. దైవపూజా పురస్కారములను విశేషముగా చేయుచు యోగులన్నను, సాధువులన్నను సేవాశుశ్రూషలు నెఱపుచుండును. గురుదేవునకు ఈ యమ నుద్ధరించి, ఆమెకు తత్త్వోపదేశముచేసి క్షీణమైన ఒక సనాతన ధర్మమును ఉద్ధరింప వాంఛకలిగినది. గోపాలకుడై ఆమెయింట ఊడిగము చేయుటకు ఆమెను

అంగీకరింప జేసినాడు. కృష్ణదేవుడు గోపాలనము నెఱపి భారతీయులకు "గోమాత పూజనీయ" అని నిరూపించినట్లు, వీరగురుడును గోపాలనా యోగము పూని, అట్టి మహోపర్శమునే మఱల చాటబూనెను. గోక్షీరములు మాత్రమే ఆహారముగా చేసికొని గోవులను తోలుకొనిపోయి, ఒక్కచో నిల్పి, తా నొక కొండగుహలో కాలజ్ఞానమును వ్రాసికొనుచు కూర్చుండుట గురుదేవుని దినచర్య. ఈ ఉదంతము రెడ్డిదంపతుల చెవి సోకినది. వారు వీరప్ప కార్యవిధానమును పరికించుటకై ఒకనాడు ఆ పర్వతకందరమును దఱిసి చూచిరి. గుహాంతర్భాగమున వీరయోగి పద్మాసన స్థితుడై ఏకాగ్రదీక్షతో తాటియాకుల మీద ఏమేమో వ్రాయు చుండెను. ఆతని చుట్టును అలౌకికమగు నొక దివ్యతేజము ఆవరించి యున్నది బాలుడు ఈ రెడ్డిదంపతులకు బ్రహ్మగను, విష్ణువుగను, శివుడుగను, పంచముఖుడుగను క్షణమున కొకరీతిగా తోచుచుండెను. ఈ అలౌకిక సంఘటనమునకు వారు ఆశ్చర్యభరితులైరి. నూతనములగు జ్ఞాన బలశక్తులు వారిలో రేకెత్తినవి ఎట్టకేలకు సమీపించి, ఆ త్రికాల వేత్తను స్తోత్రముచేసి ఆయన కారుణ్యమునకు పాత్రులైరి. అర్హులగు నా దంపతులకు గురుస్వామి మంత్రోపదేశము చేసి, యోగమార్గమును ఉపదేశించి, ధన్యజీవుల నొనర్చెను. 'శూద్రులకు మంత్రాధికారము లేదు." అను సంకుచిత సంప్రదాయమును గ్రుడ్డిగా అనుసరింపరాదనియు శూద్రునకుగాని, బ్రాహ్మణునికి గాని హృదయసంస్కారమును బట్టియు, యోగ్యతను బట్టియు, బ్రహ్మవిద్యాధికారము చేకూరు ననియు, ఈ అంశముచే గురుదేవుడు బోధించి యున్నాడు. గురుదేవుని ఈ సదాశయము ఈ దంపతుల విషయమునందే కాక, సిద్ధప్పవిషయమునను, అంతకంటె ఎక్కువగ మాదిగ కక్కని విషయమునకూడ తెల్లము కాగలదు. కక్కడు అంత్యకులజాడైనను హృదయ సంస్కారము, సాధన చతుష్టయసంపద కలవాడు కావున, బ్రహ్మను గ్రహమునకు

పాత్రుడై వీరగురునిచే బ్రహ్మోపదేశము నంది కృతార్థుడైనాడు. ఈ అంశమే ఒక్కసారి దిగువరీతిని గానము చేయబడినది.

కులమునకుఁ గాక యోగ్యతకును గుణమ్ము
నకును మన్నన యొసఁగి యంత్యజున కేని
ఔపనిషదర్థ పీయూష మందఁ జేయు
నట్టి దేశికు చరణమ్ము లాశ్రయింతు.

గురుదేవుడు పై అంశమునే పలుతావుల నుగ్గడించి, నవాబుల యాస్థానములందును ఉపన్యసించెను. ఆదిశంకరులు సైతము కాశీ నగరమున, తత్త్వజ్ఞుడైన చండాలునితో సమావేశమైన సందర్భమున, తన అజ్ఞానపుపొర వీడిపోవ- "చండాలోఽస్తు స తు ద్విజోఽస్తు గురురి త్యేషా మనీషా మమ" అని గానము చేసినాడు కదా ! కులముల యొక్క మూలతత్త్వము తెలియనప్పుడు, ఎంతటివారేని పొరపాటు పడుట వింతకాదు.

గురుమూర్తి బనగానపల్లెలో నుండి కాలజ్ఞాన రచన మొనర్చు సమయమునందే అన్నాజయ్య అనెడి ఒక బ్రాహ్మణభక్తుడు ఆయనకు శిష్యుడుగా చేరెను. అన్నాజయ్య బ్రహ్మ విద్యాధికారి యని తెలిసికొన్న గురుమూర్తి ఆయన సేవాశుశ్రూషలకు మెచ్చి, ఆయనకు మంత్ర యోగాదులను ఉపదేశించి, పెక్కు కాలజ్ఞాన రహస్యములను కూడ బోధ చేసెను వీరగురుని ఆశ్రయించి అచిరకాలములోనే కృతార్థులైన వారలలో అన్నాజయ్య అగ్రేసరు డందురు. గురు మహాదేవుడు తాను వ్రాసిన కాలజ్ఞాన గ్రంథసర్వస్వమును అన్నాజయ్యకే యొసగి అతనినే దానిని ప్రచారము చేయుటకు నియోగించెను. అతని వలననే కాలజ్ఞానము లోకమున వ్యాపించినది.

గురుదేవుడు బనగానపల్లెలో నేలమఠమును స్థాపించి, అందొక శివలింగమునుకూడ ప్రతిష్ఠించినాడు పిమ్మట అచ్చమ్మగారి యింటనే తాను వ్రాసిన కాలజ్ఞానగ్రంథముల నన్నింటిని భద్రపఱచి వెడలిపోయెను. ఆ సమయముననే కడపమండలము నందలి దుప్పూరు గ్రామమునందును కొంతకాలము నివసించి, అక్కడి భక్తుల కోరికమీద, ఆ యూరిలో కాళికాదేవిని గూడ స్వయముగా ప్రతిష్ఠించినాడు.

## గృ హా స్థా శ్ర మ ము

యతులకే గాని ముక్తి, గృహస్థ తతికి
దూర మనెడు నపోహము దొలఁగఁ జేసి
గేస్తు ధర్మమ్ము ప్రకటించు గృహివరేణ్యుఁ
డెపుడు వసియించుఁగాత మా హృదయసీమ.

గురుదేవుడు ఇంతవఱకును బ్రహ్మచర్యాశ్రమముననే ఉన్నట్లు పాఠకులు గ్రహించి యుండవచ్చును. తనజీవితములో గార్హస్థ్య ధర్మమునుగూడ ఆచరించి చూపినగాని లోకమునకు పరమాదర్శమును చాటినట్లుగాదు. ఆ కాలము వఱకును బౌద్ధులేమి, శంకరాదులేమి, ముముక్షువులకు సన్న్యాసాశ్రమమే సమాశ్రయింప తగినదని ప్రచారము చేసి, జనులకు గార్హస్థ్యము నెడ నిరసన భావమును కలిగించి యున్నారు. అది కారణముగా గృహస్థుడు కేవలము కామారాధకుడయి ధర్మపత్నిని కామోపకరణముగా భావించి, గృహస్థాశ్రమముయొక్క ఉత్తమోత్తమ లక్ష్యమునుండి జారిపోయెను. ప్రజా సమూహములోనున్న ఈ గార్హస్థ్య నిరసనభావమును పోగొట్టి యద్దాని పూజ్యతను లోకమునకు ఆచరణ పూర్వకముగా నిరూపించుట కొఱకు, ఆజన్మ బ్రహ్మవేత్తయయ్యు బ్రహ్మము గృహస్థుడైనాడు ఆయనకు మహాబ్రహ్మవేత్తయైన జనక

చక్రవర్తి అనుసరించిన మార్గము నచ్చినది. సనాతన ఋషులు సయితము సర్వజ్ఞులయ్యు గృహస్థులగుట ఉత్తమ మానవ సమాజమును సృష్టి సేయుటకే యని మన సునిశిత దృష్టికి పొడకట్టగలదు. ఖిలములు కాని ఋషి మహాదర్శములను ప్రకటించుటకే వీరగురుని అవతారము కావున, ఆతడు పెదకొమెర్ల నివాసియు, అనూచాన వంశమున నవతరించినవాడును నగు శివకోటయ్యగారికి దైవానుగ్రహమువలన కలిగిన గోవిందమ్మను పెండ్లాడి గృహస్థు డాయెను. గోవిందమ్మ సుగుణముల రాశి; పతిసేవావ్రతమే జన్మతారకమని భావించి చరించు పుణ్యసాధ్వి. ఇట్టి అతివలమిన్నతోడి గురుదేవుని కాపురము దివ్య సౌఖ్యములకు నివాస మగుట ఆశ్చర్యము కాదు.

వీరగురుని ఈ వివాహ సంఘటనముగూడ విచిత్రముగానె జరిగినది. బాల్య వివాహములు జరుగు నా కాలములో గోవిందమ్మగారి పెండ్లి రజస్వలానంతరమే జరిగినది. ఆమె తండ్రి సర్వసంపదలతో నిండిన సంబంధము తేవలయునని ప్రయత్నించుచుండువాడట. ఆమె "తనకు దగిన వరుడెవ్వరో తనకు తెలియుననియు, అట్టి మహావ్యక్తి వచ్చువఱకును తాను పెండ్లి చేసికొనననియు" పట్టుపట్టి కూర్చుండినదట. ఇట్లు కొంతకాలము గడచుటయు, తుద కామె రజస్వలయగుటయు, కులము వారాక్షేపించుటయు, సంబంధములు రాకపోవుటయు కూడ సంభవించెను. ఎట్లు జరిగినను ఆమె మాత్రము చలింపక దైవనిర్ణయము నెఱింగిన దానివలెనే తలిదండ్రులను, బంధువులను ఊఱడించుచు, తనకు తగిన వరుని దైవమే నిర్ణయించి పంపునని చెప్పుచు కాలక్షేపము చేయుచుండెను. అప్పటికే వీరబ్రహ్మముగారు మహానుభావుడని దేశమున ఆయనపేరు మాఱుమ్రోగి పోవుచుండెను. ఇట్టి స్థితిలో ఒకనాడు వీరగురుడు శివకోటయ్యగారి యింటికి వచ్చుట సంభవించెను. ఆ మహా

పురుషునితోనే తనకు పెండ్లి జరిపింపుడని గోవిందమ్మగారు తలిదండ్రు లనుప్రార్థించెను. ఇల్లు వాకిలి లేని ఒక బైరాగివానికి తమ గారాబు కొమరిత నిచ్చుటకు ఏ తలిదండ్రులైనను ఒప్పుకొందురా? శివకోటయ్య దంపతులు మొట్టమొదట ఆ సంబంధమునకు అంగీకరింపరైరి. అయినను కన్య పట్టుదలవలన చిట్టచివరకు ఒప్పుకొనక తప్పినది కాదు దీనికితోడు బ్రహ్మగురుడు మహానుభావుడని వినియున్నారు కావున "ఈ సంఘట నము ఎందుకు జరుగుచున్నదో" అనుకొని వారు కూతుముద్దు చెల్లించిరి. గోవిందమా వీరబ్రహ్మయోగుల కల్యాణము పార్వతీ పరమశివుల దాంపత్యమువలె జగత్కల్యాణ కారకమైనది.

ఉత్తమ గార్హస్థ్యధర్మమును సతీపతులు ఇరువురును నిర్వహించి లోకమునకు గరిష్ఠాదర్శములను నిరూపించిరి రెండవ రామచంద్ర మూర్తివంటి భర్తకు నీడవలె మెలగుచు, ఆయన రెండవ హృదయమో యన ప్రవర్తించుచు, ఆత్మనాథుని అధ్యాత్మ యోగ జ్ఞానాది బోధా చరణములలో ఆయనతో సహకరించుచు గోవిందమ్మ అచిరకాలముననే అతిథ్యభ్యాగతులకును, శిష్యవర్గమునకును, బంధుకోటికిని-వేయేల, సర్వ ప్రజానీకమునకును ఆరాధనీయురాలయ్యెను. ఇటీవలి కాలమున మన వారు రజస్వలానంతర వివాహముల ప్రాముఖ్యమును గుర్తింపగా, బ్రహ్మగురుడు అలనాడే వాటి అవశ్యకతను గుర్తించి స్వయముగా అచరణలో పెట్టి ఒక ఉత్తమ సంస్కారమును చాటియున్నాడు. అచిర కాలముననే ఆ పుణ్యదంపతులకు క్రమముగా విశ్వకర్మ దేవుని కుమారు లగు పంచఋషులా యనునట్లు గోవిందయ్య, సిద్ధలింగయ్య, శివ రామయ్య, ఓంకారయ్య, పోతులూరయ్య-అను నైదుగురు పుత్రులును, వీరనారాయణమ్మ యను ఒక పుత్రికయు ఉదయించిరి.

బాల్యమున వీరప్పయ్య, వీరనారాయణ, వీరప్ప–అని పిలవబడిన గురుదేవుడు కందిమల్లయపల్లెలో ప్రవేశించిన పిమ్మట బ్రహ్మముగారను పేర పిలువబడినారు. ఇందుకు గల కారణము ఆరయవలసి యున్నది. అప్పటికే ఆయన "అహం బ్రహ్మాస్మి" అనెడి మహా వాక్యమును అనుభూతికి తెచ్చుకొనుటయే కాక, శిష్యులకును దాని లక్ష్యార్థమును బోధింప బూనినాడు. ఆ సమయమున నే "నే నే బ్రహ్మమురా, పామరులార, నే నే బ్రహ్మమురా!" అనెడి తత్త్వమునుగూడ వ్రాసి ప్రచారముచేసి యుండును. ఆ కారణముచేత ఆయనను, ఆయన శిష్యులే కాక, ఎల్లరును సాక్షాదక్షర పరబ్రహ్మ స్వరూపముగా భావించి బ్రహ్మముగారని పిలువజొచ్చిరి. మఱికొందఱు విశేషజ్ఞులు బాల్యనామధేయమగు - వీరప్ప, వీరనారాయణ పదములలోని "వీర" శబ్దమునుగూడ జోడించి-వీరబ్రహ్మేంద్రస్వామి, వీరబ్రహ్మము- అని కూడ పిలువ బూనినారని ఊహించుటకు వీలు చిక్కుచున్నది. ఇందుకు తగినట్లు ఆ మహనీయుని ఉపాసించెడి మంత్రములుగూడ "శ్రీమద్వీరనారాయణాయ నమః, శ్రీవీరబ్రహ్మణే నమః' మొదలగు రీతులుగా ప్రచారమునందు గలవు.

## శిల్పయోగము

అల సనాతన ఋషిధర్మమైన శిల్ప
కర్మయోగముఁ బూని నైష్కర్మ్య సిద్ధిఁ
జాలె నే కర్మకుశలుఁ డా సంయమీంద్రుఁ
డొసఁగి ప్రోచుత సత్క్రియా యోగదీక్ష.

గృహస్థుడైన మన గురుదేవుడు ధనోపార్జనకు సాధనముగా తనకు ఆ బాల్యమునుండి అలవడిన వేదవిద్యను (పౌరోహిత్యము) సాధనముగా చేసికొన్నచో, అనాయాసముగా వచ్చు బియ్యములను ఆకర్షించుటతో జీవితసమస్య పరిష్కారమై పోయెడిదే. కాని అందుకు ఆయన ఇయ్యకొనలేదు. ఉత్తమ ధర్మమగు శిల్పకర్మము నాచరించి కుటుంబభరణలీలను ఆతడు జరిపెను. సర్వశిల్ప కలాగురుడగు ఆతనికి చేతగాని శిల్పవిద్యలేదు. అయినను ఆ ప్రదేశమునకు అవసరములైన కమ్మరమును, వడ్రంగమును, శిలాశిల్పమునే ఆతడు అనుష్ఠించినాడు. బ్రహ్మదేశికుడు నివసించిన ప్రదేశము పర్వత మయ మగుటంబట్టి, గాలనుండి ఇనుమును తీసి కమ్మరమును చేయుటకును, గాలతో దేవ మూర్తి, దేవమందిరాది నిర్మాణములు చేయుటకునే ఆతడు ఎక్కువశ్రద్ధ చూపినట్లు తెలియుచున్నది. ఇంకను దారుకర్మనుకూడ ఎక్కువగా ప్రోత్సహించి భవనాదినిర్మాతలకు గూడ ఆతడు నూత్న చైతన్యమును చేకూర్చి భవన నిర్మాణకళను ఉద్ధరించెను. "శిల్ప మధ్యయనం నామ వృత్తం బ్రాహ్మణ లక్షణమ్" అను సూక్తికి గురుదేవుని జీవితము లక్ష్య భూతమై ఒప్పినదని చెప్పుట వింతకాదు ఎంతయో దూరదృష్టిగల గురు దేవుడు భావిభారత సమస్యలను తన దివ్యజ్ఞానములో ప్రత్యక్షీంప చేసి కొన్న మహనీయు డగుటచేత సారస్వత విద్యలకు కర్మవిద్యల తోడ్పా టున్నగాని, మానవజీవితము ధర్మార్థములు అనెడి పురుషార్థములను సాధించుటలో సమర్థముకాదని యెంచి, తదాచరణమును స్వీయజీవితమున నెలకొల్పినాడు. గురుదేవుడు కేవల వ్యక్తిమాత్ర జీవిత నిర్వాహణమునే దృష్టిలో నుంచుకొని తాను ఆదర్శములను చాటలేదు. విశ్వకుటుంబియగు గురుని విశాలహృదయములో "సుజల, సుఫల, మలయజ శీతల, బహు కోటి కంఠ కలకల నినాద కరాళ' అయిన వి శా ల భా ర త మా త

ప్రతిఫలించినది. అన్యపాలనమునకు లోబడి అర్థసిద్ధిలో వెనుకంజ వేయుచున్న హిందూదేశమునకు శిల్పపరిశ్రమల దార్ఢ్యమున్నగాని కృత కృత్యత లేదని ఆ మహనీయుడు ఈ ఉత్తమాదర్శమును నడపెనని గ్రహింపవలయును. విశాలభావముతో ఆలోచించినచో ఒక్క భారత దేశమునకే కాక, ఏ దేశమునకైనను, ఏ జాతికైనను, ఏ ప్రజకైనను ఈ శిల్పకర్మానుష్ఠానము ఆవశ్యకమై జీవితమున అర్థపుష్టిని చేకూర్చు నుత్తమ సాధనమై చెన్నొందును గావున, విశ్వమానవ ధర్మమునే గురు దేవుడు స్వయముగా అనుష్ఠించి ప్రబోధించినాడని తెలియగలము. భారత దేశములో శిల్పలక్ష్మి తాండవించునప్పుడు మన ఐహికాముష్మిక విభూతులు ఎట్లు వెల్లివిరిసినవో మన దృష్టిని భూతకాలమునకు మరల్చిన తెలియగలదు ఈ అంశమునే వీరబ్రహ్మము పెక్కురగు నవాబులకు నచ్చజెప్పి వారిచే శిల్పవిద్యాదేవిని ఆరాధింప జేసినాడు. మొన్నటివఱకును మన గాంధి మహాత్ముడు సైతము సారస్వతవిద్యలకు వృత్తి విద్యల తోడ్పాటునే చేకూర్చి దేశకల్యాణమును సాధింప జూచియున్నాడను విషయమును పాఠకు లిచ్చట గమనింపవలయును. ఈ సందర్భమున గురుదేవుని బాల్యకాలమునందలి లీలావిశేషము నొకదానిని మనము స్మరింతముగాక!

## మూర్తి పూజ

శిలాశిల్పమున కడు నేర్పరియగు వీరగురుడు పూజోచితమగు శిలతో వీరభద్ర విగ్రహమును ఒకదానిని నిర్మించి, ప్రాణప్రతిష్ఠ చేసి దానిలో చైతన్యమును ప్రవేశపెట్టెను. ఆ విగ్రహము కుముద్వతీనది (కుందునది) లో బడి ప్రవాహవేగమున "అల్లాడుపల్లె" యను గ్రామము వద్దకు కొట్టుకొని వచ్చెను. ప్రతిదినము ఆ విగ్రహమునుండి ఒక

బాలుడు వచ్చి ఆ గ్రామమునందలి బాలురతో ఆడుకొని, సాయంకాలము కాగానే మరల నదిలో మునిగి అంతర్హితుడై పోవుచుండువాడు. ఇట్లు కొంతకాలము గడచిన పిమ్మట ఆ వీరభద్రస్వామి ఆ యూరి పెద్దకాపునకు స్వప్నమున అగపడి తనను ఒకదేవాలయమున ప్రతిష్ఠించి పూజింపవలసినదనియు, తన భక్తుల కామితార్థములను తాను పూరింతు ననియు చెప్పెను. తరువాత ఆ దేవుని ఆజ్ఞానుసారమే అట్లు జరుగగా, వీరబ్రహ్మగురుడు ఈ యుదంతము నెఱింగి, అల్లాడుపల్లెకు వచ్చి ఆ దేవుని కొంతకాలము ఉపాసించి విగ్రహారాధన మహత్త్వమును, ప్రయోజనములను ఎల్లవారికి ఉపన్యసించెను. మన మెఱింగినంతలో వీరదేశికుడు తనకు దేశికునిగా భావించినది ఈ వీరభద్రస్వామినే. నేటికిని ఈ వీరభద్రస్వామి అల్లాడు పల్లెలో పూజా పురస్కారముల నందుచు భక్తుల వాంఛితార్థములను తీర్చుచున్నాడు. బ్రహ్మశిల్పి అయస్కారవృత్తిని (కమ్మరము) ఆచరించుటచేత—ఇహలోక జీవన నిర్వహణ సాధనమును, వీరభద్రస్వామిని నిర్మించి ప్రతిష్ఠించి పూజించుటచేత పారమార్థిక సాధనమును నిరూపించియున్నాడు. హిందూదేశమున అనాదిసిద్ధముగా విగ్రహారాధనమునుండి ఆస్తిక్యమును ఉద్ధరించు చున్నదిగదా! జనసమూహమునకు అన్నవస్త్రములను చేకూర్చు కృషికార్యములకు అత్యంతము ఉపకరించు కమ్మరమును, వడ్రంగమును ప్రోత్సహించుటలో గురుదేవుని సూక్ష్మదృష్టి అన్నవస్త్రసంపాదనములో ఎట్లు లగ్నమయినదో ఊహించి చూడుడు. ప్రతిమా నిర్మాణ మొనర్చి ఉపాసనము చేయుటచేత సనాతన శిల్పిఋషుల ఉత్తమాదర్శమును ఆచరించి చూపెను.

# యోగోద్ధరణము

ఘనతరాష్టాంగ యోగమ్ము కాలిపోయి
శుష్క వేదాంతమున యోగశూన్య మయిన
జగమునన్ యోగమార్గ సంస్థాపన మ్మొ
నర్చు యోగీశ్వరుఁడు శరణమ్ము మాకు.

గీతాచార్యుడు "ఆత్మ సంయమయోగము" లో ప్రాణాయామా ద్యష్టాంగ యోగమును ఉపదేశించి అంతమున దాని మహత్త్వమును గూర్చి చెప్పుచు—

"తపస్విభ్యోఽధికో యోగీ జ్ఞానిభ్యోఽపి మతోఽధికః
కర్మిభ్య శ్చాధికో యోగీ తస్మా ద్యోగీ భవార్జున ।" 6-46.

ఈ యోగమును అనుష్ఠించిన యోగి తాపసుల కంటెను, జ్ఞానుల కంటెను, కర్మఠులకంటెను అధికుడని నుడివి యుండెను. అనుభవ రహితమగు పుస్తకజ్ఞానమును ప్రకటింపవచ్చును. కర్మము లొనర్ప వచ్చును. శరీరమును కృశింపజేయుచు చాంద్రాయణాది తపములు నాచ రింప వచ్చును. కాని, త్రికరణములను, ప్రాణ మనశ్శక్తులను వశము చేసికొని సదాచరణ సాధ్యమగు యోగమును అనుష్ఠించుట కష్టము. అందును ధ్యాన, ధారణ, సమాధులనెడి త్రికమునందు అధికారమును సంపాదించి, కృతకృత్యుడై సంయమవ్రతము చేత అతీతాద్భుత శక్తులను కైవసము చేసికొని ఆత్మేశ్వరుడై ప్రకాశించుట అరిది మన సనాతన మహర్షులు ఇట్టి యోగమును ఉగ్గుబాలతో అచరించెడివారు. మునుల

ఆశ్రమములందును, కులపతుల విద్యాశాలలయందును యోగాభ్యాసాది సదనుష్ఠానములు ఎట్లు నిర్వర్తింప బడెడివో సంస్కృత వాఙ్మయమును కాంచినచో తెల్లము కాగలదు. ప్రాచీనులు యోగమునందు శ్రద్ధ కల వారగుటచేతనే మనము నమ్మజాలనట్టి అత్యద్భుత శక్తులనుగూడ పిడికిట బట్టి లోకసంతరణ మొనర్చి ధన్యులైరి. యోగము పండినపుడు యోగీశ్వరుడు పొందెడి ఫలములను, యోగానుష్ఠాన మార్గములను పాతంజల యోగసూత్రాది గ్రంథములు విస్తరముగ ఉగ్గడించు చున్నవి. యోగ విశేషములను తెలిసికొనగోరువారు ఈ రచయిత వ్రాసిన యోగ దర్శనమును చదువుట మంచిది.

వీరదేశికుడు అవతరించి ఒనర్చిన మహాకార్యములలో యోగానుష్ఠాన ప్రబోధము మఱియొకటి. ఏ కర్తవ్యము నైనను గురుదేవుడు స్వయముగా అనుష్ఠింపక లోకమునకు బోధింపడని పాఠకులు మఱువ రాదు. అధీతిబోధాచరణ ప్రచారములు నాల్గును అమ్మహనీయుని జీవితము నందు సముచితస్థానము నలంక్రమించుకొన్నవి అజన్మసిద్ధుడగు ఈ యోగీశుడు యోగమార్గములో మెట్టని ఘట్టములేదు. పరకాయ ప్రవేశ మేమి, జీవత్సమాధియేమి, అణిమాద్యష్టసిద్ధులేమి అన్నియు అవసరమైన ఘట్టములందు ప్రదర్శించినాడు. చిత్తము ఏకాగ్రమై ధ్యేయవస్తువును ధ్యానింప సమర్థమగు వఱకైనను ముముక్షువు యోగాభ్యాసము చేయకున్న అట్టివానికి ముక్తి సులభసాధ్యము కాదని గురుదేవుడు తన తత్త్వ వాఙ్మయములో చాటిచెప్పినాడు. తన్నాశ్రయించిన శిష్య ప్రశిష్యులకు ఎల్లరకును బాల్యమునుండియు యోగవిద్యను గఱపి, వారిని ఉత్తమ యోగీశ్వరులనుగా తీర్చిదిద్దినాడు. యమ నియమములను అనుష్ఠింపని వారిని శిష్యులనుగా చేర్చుకొనుటకే గురుదేవుడు అంగీకరించువాడు కాడు.

ఆ యమ నియమములు సిద్ధింపనివారికి ఆసనప్రాణాయామములను నేర్ప వారు కాదు.

నిక్కమాలోచించినచో యోగములో మొదటి అంగము లగు యమ నియమములను ఆచరించుట చేతనే సాధకుడు గొప్ప గొప్ప ఫలములను పడసి, ఎంతయో ఆత్మసంస్కారమును అందజాలు నని యోగశాస్త్రమును, యోగీశ్వరుల అనుభవమును చాటుచున్నవి. అహింస, సత్యము, అస్తేయము, బ్రహ్మచర్యము, అపరిగ్రహము—అను అయిదును యమమునకు అంగములు. అహింసావ్రత పాలనమువలన సర్వభూత మైత్రి చేకూరగలదు. సత్యవ్రతానుష్ఠానముచేత వాక్శుద్ధి కలుగును. ఇంకను శాపానుగ్రహ సామర్థ్యము సహితము అబ్బును. అస్తేయ మనగా దొంగతనము లేకుండుట. దానిచేత సర్వరత్న సంప్రాప్తి కలుగ గలదు బ్రహ్మచర్యము వలన తేజో వీర్య శక్తులు ఇనుమ డించును. అపరిగ్రహము వలన పూర్వోత్తర జన్మజ్ఞానము ఉదయించును.

శౌచము, సంతోషము,తపస్సు,స్వాధ్యాయము, ఈశ్వరప్రణిధానము అనునవి ఐదును నియమమునకు అంగములు. శౌచమును అనుష్ఠించుట చేత దేహ మనో నైర్మల్యము, సత్త్వశుద్ధి, సౌమనస్యము, ఏకాగ్రత-అనెడి గుణములు కలుగుచున్నవి. సంతోషముగా నుండుటచేత అనుత్తమ సుఖలాభము చేకూరుచున్నది. తపస్సువలన శరీరేంద్రియములు పరి శుద్ధములయి ఈశ్వర సాక్షాత్కార యోగ్యతను కూర్చుచున్నవి. వేద శాస్త్రాది గ్రంథములను, మహాత్ముల జీవితములను, మంత్రములను పఠించుటయే స్వాధ్యాయము. అద్దానిచే ఇష్ట దేవతా సందర్శనము సిద్ధించును. సర్వము బ్రహ్మమయ మని భావించి, అహంకార మమ కారములను వీడి, ఈశ్వరార్పణబుద్ధితో కర్మములను ఆచరించుట ఈశ్వర ప్రణిధానము. ఈ ఈశ్వర ప్రణిధాన మనెడి నియమాంగమును అనుష్ఠించి

నందువలన శీఘ్రకాలమున సమాధినిష్ఠ సిద్ధించుచున్నది. అహింస మొదలగు ఈ పదిఅంగములను మనస్సుచేతను,వాక్కుచేతను,కాయముచేతను, అనుష్ఠింపవగినవై యున్నవి. త్రికరణముల చేతను వీటిని ఆచరించిననే అవి సత్ఫలముల నొసంగగలవు. యమ నియమములనెడి రెండంగముల సదనుష్ఠాన మాత్రము చేతనే సాధకుడు ఎంతటి సంస్కారమును పొంది పవిత్రు డగుచున్నాడో చూచితిరా !

సాధకుడు యమ నియమానుష్ఠానములో కృతార్థుడైన పిమ్మటనే ఆసనమునకు, ప్రాణాయామాచరణమునకు అర్హుడగును. అటుపిమ్మటనే ప్రత్యాహారమునకు అర్హత. ఆ తరువాతనే యోగమునకు అంతరంగములని చెప్పబడిన ధారణా ధ్యాన సమాధులను అనుష్ఠించు యోగ్యత కలుగుచున్నది. సాధనచతుష్టయసంపత్తి లేనివానికి బ్రహ్మజిజ్ఞాసాధికార మెట్లు లేదో, అట్లే యోగవిషయమునను పూర్వ పూర్వములగు అంగములను అనుష్ఠింపని వానికి ఉత్తరోత్తరాంగములను ఆచరించు యోగ్యత లేదని సాధకులు గ్రహింపవలయును. ఇది అంతయు మహారహస్యమగు యోగ ప్రణాళిక. దీనిని శాస్త్రాధారముచేతను, యోగసిద్ధులగు సద్గురువుల అనుగ్రహముచేత మాత్రమే గ్రహింప వీలగుచున్నది శాస్త్రాధ్యయనము ఉన్నను, గురువుల మార్గదర్శకత్వము లేకుండ యోగమును అనుష్ఠింపరాదు. అట్టిది అనేకానర్థములకు దారి తీయును. ప్రాణాయామములో రేచకము, పూరకము, కుంభకము, కేవల కుంభకము, వాయునిరోధము మొదలగు అనేక భేదములు కలవు. ఒక్కొక్క సాధకునికి ఒక్కొక్క తీరు సరిపడుచుండును. అందఱకు ఒకటే మార్గము ప్రయాణింపదగినది కాదు. అందుకే శిష్యుల యోగ్యతలను, మనశ్శరీరముల స్థితి గతులను ఎఱింగిన సద్గురువుల మార్గదర్శకత్వము అవసరమని చెప్పవలసివచ్చినది.

ఈ అష్టాంగయోగమును, సంయమమును, దానిచే గల్గు సిద్ధులను గూర్చి ఈ గ్రంథకర్త రచించిన *సిద్ధప్పచరిత్రములో కూడ కొంత వఱకు వ్రాయబడియున్నది. నేడు నష్టప్రాయములైన యోగశాస్త్ర రహస్యములను గూర్చి చేయవలసినదియు వ్రాయవలసినదియు ఎంతయో కలదు. ఎంత వ్రాసినప్పటికిని యోగ మనునది అభ్యాసమును, వైరాగ్యమును ముఖ్యముగా అపేక్షించుచున్నది. ఆచరణ శూన్యములైన శుష్కోపన్యాసములచేత ఫలము సిద్ధింపదని తెలియవలయును.

అనేకులగు బ్రహ్మజ్ఞానులేమి, భక్తులేమి సాధారణ మానవుల వలెనే మరణించుచుందురు. ఇట్టివారిని గూర్చియే 'ఉమర్ ఖయ్యాం' అను పారశీక కవీంద్రుడు ఇట్లు వచించినాడు—

"అఖిల వేదాంతశాస్త్ర తత్త్వాబ్ధి లీది
పరమ విజ్ఞాన దీపమౌ పండితుండు
కాళరాత్రిని మార్గంబు గానలేక
అల్ల మామూలు కత సెప్పి యంతరించు."

—శ్రీ దువ్వూరి రామిరెడ్డిగారి తెలుఁగు

కొందఱు మాత్రము తమ దేహావసాన సమయమును గుర్తించి, ఆత్మీయులైనవారికి ఆ ప్రాణప్రయాణ కాలమును తెలియజేసి పరమ పదమును అలంకరించుచుందురు. ఇట్టివారి సంఖ్యగూడ తక్కువే యన వచ్చును. యోగము పండిన సంయములకు తమ ఆయుఃప్రమాణము తెలియును గావున, వారుమాత్రమే ఆ విషయమును సూచింపగలరు.

---

*ఈ గ్రంథమును గుంటూరుజిల్లా సత్తెనపల్లిలోని శ్రీ జవంగుల నాగభూషణదాసు సన్నువారు ప్రకటించినారు.

తక్కినవారికి ఆ జ్ఞానము లేకున్నను, వారు నిరంతరము ఆత్మధ్యాన పరాయణులై యుందురు గావున—

"అంతకాలే చ మా మేవ స్మరన్ ముక్త్వా కళేబరమ్
యః ప్రయాతి స మద్భావం యాతి నా స్త్యత్ర సంశయః."

గీత. అధ్యా. 8-శ్లో. 5.

"మరణకాలమున నన్ను స్మరించుచు శరీరత్యాగము చేసినవాడు నాభావమునే-అనగా ఆత్మభావమునే పొందును." అను గీతాప్రమాణమునుబట్టి వారికిని ముక్తి లభించుననుటలో ఆక్షేపము లేదు. కాని వీర యోగీశ్వరుని స్థితి అట్టిదికాదు. ఆయన కేవలము భక్తమాత్రుడు కాని, యోగిమాత్రుడుగాని, జ్ఞానిమాత్రుడుగాని కాడు గదా! అతడు యోగోద్ధారకుడగు మహానుభావుడు. ఆజన్మ బ్రహ్మజ్ఞానియే కాక, సాక్షాద్విరాట్పురుషుడగు పరబ్రహ్మము ఇట్లని కాలజ్ఞానాది గ్రంథములు వాకొనుచున్నవి. ఆ మహానుభావుని లీల లన్నియు ఈ అంశమునే చాటుచున్నవి. ఆ దేవుని ఉపాసించి తత్త్వమును సాక్షాత్కరింప జేసికొన్న ఉపాసకులును అట్లే చెప్పుచున్నారు ఇంతయేల, ఆయనయే స్వయముగా తన కాలజ్ఞానగ్రంథమున తన దివ్యావతార మహిమలను వక్కాణించియున్నాడు గదా! కనుకనే జగద్విముక్తి కోసము ఆ గురుదేవుడు తపోలోకమునకు పోవుచున్నాడా అనునట్లు ప్రాణములతో నుండియే దివ్యసమాధిలో ప్రవేశించినాడు. నేటికిని ఆ మహాపురుషుడు ఆ సమాధిలో ఉన్నాడనియే పలువురి విశ్వాసము. నేటి సంగతి మనకు తెలియకున్నను, గురుదేవుడు సమాధియైన పిమ్మట సంవత్సరమువఱకును చెక్కుచెదరని జీవములతో నిలిచియున్నాడని తరువాతి గ్రంథమున తెలిసికొనగలము. అన్నపానీయములు స్వీకరింపక సంవత్సరకాలము సమాధిలో సజీవుడై యున్న

యోగీశ్వరుడు చిరకాలము వఱకును ఉండుటలో ఆశ్చర్యమేముండును? కనుక, ఆ బ్రహ్మగురుని దివ్యలీలలు వాచామగోచరము లనుటకన్న "ఇద మిత్థ"మని చెప్పుటకు వీలుకాకున్నది. బ్రహ్మముగారికిని, తదితర మహాపురుషులకును ఉన్న ప్రధానభేదములు ఇట్టివి పెక్కులు పొడకట్టు చున్నవి. బ్రహ్మముగారి వలెనే ఆయనభార్య యగు గోవిందమ్మగారేమి, కుమారులు గోవిందయాదులేమి, మనుమరాలగు ఈశ్వరమ్మగారేమి, ప్రధాన శిష్యుడగు సిద్ధప్పయేమి, సిద్ధప్పగారి శిష్యుడగు కరణము గోవిందయ్యగారేమి, ఇంకను పెక్కురు శిష్య ప్రశిష్య సంతానమేమి. తమ ఆయుఃప్రమాణమునెఱింగి, ప్రాణప్రయాణసమయమును తెలిసికొని, ఆ సంగతిని అర్హు లగువారికి తెలిపి, జీవత్సమాధినిష్ఠ వహించి తద్గురు సంప్రదాయమును పోషించినవారే! ఈ విధముగా వీరబ్రహ్మగురుడు నష్టమైన యోగమును అనుష్ఠానపూర్వకముగా సముద్ధరించి మహా యోగోద్ధారకుడై ప్రకాశించినాడు.

## మ త సా మ ర స్య ము

హైందవ మహమ్మదీయ సఖ్యమ్ముకొఱకు
సర్వ మానవ ధర్మంబు చాటి చెప్పి,
"ఆలకింపుఁ డమృతపుత్రు లంద" అనెడి
విశ్వధర్మ నిర్ణేత భావింతు నెపుడు.

వీరయోగీంద్రుని జీవితములోని ప్రముఖఘట్టములలో ఇంకొకటి సిద్ధోపదేశము. సిద్ధప్ప మహమ్మదీయ మతమునకు చెందిన బాలుడు. అయినను పూర్వజన్మ కర్మపరిపాకము ననుసరించి ఆతనికి హిందూమత ధర్మములు, సిద్ధాంతములు నచ్చినవి. 'ముడుమాల' గ్రామము కాపుర ముగా గల యీ బాలునకు అనతిదూరములో "కందిమల్లయ్యపల్లె"

యందుండి అద్భుతచరిత్రుడై తేజరిల్లుచున్న గు రు దే వు ని య ం దు చి త్తము హత్తుకొన్నది. తనకు పొడమిన సంశయములను ఇస్లాము మతము కంటెను, హిందూమత మే సరసముగా తీర్పజాలుటచేత అతడు గురుదేవుని చరణసన్నిధికే ఆకర్షింపబడినాడు అగ్రగజాత్యభిమానముచేతను, లోకోత్తరమహనీయుడు తండ్రియగుటచేతను అన్యజాతులను నీరస ముగా చూచెడి బ్రహ్మముగారి పుత్రులు సిద్ధుని శిష్యత్వమునకు ప్రతి కూలురైరి. మ్లేచ్ఛుని శిష్యునిగా అంగీకరింప దగదని తల్లికిని దండ్రికిని అడ్డుచెప్పుచు సిద్ధుని వెడలనడపుటకు పలురీతుల ప్రయత్నించిరి. కాని, లాభము లేకపోయినది. బ్రహ్మగురుని బోధసుధ కుమారుల అభి ప్రాయములను కొనసాగనీయలేదు మానవుని గుణములకును ప్రవర్తన మునకునే ప్రాధాన్యము నొసంగవలయును గాని, స్థూలదృష్టితో కల్పితము లగు వెలుపలి భేదములకు స్థానమిచ్చి ఉన్నతికి రాదగినవారిని అణచి వేయరాదని గురు చంద్రుడు తెల్పినపిమ్మట కుమారుల ప్రాతికూల్యము ఎట్లో యించుక తగ్గెను. కాని పోతులూరయ్య మాత్రము సిద్ధుని పరీక్షిం చుటలో పట్టువిడువకయే యుండెను.

గురుకులమున గురుపత్నీ పుత్రాదులు చేసెడి అగ్నిపరీక్ష లన్నిం టిలో సిద్ధప్ప నెగ్గినాడు. అవిచలిత భక్తియోగముచే పదిరెండు వత్సర ములు ఏకదీక్షతో శుశ్రూషించి "సిద్ధప్పవంటి శిష్యుడు లే''డనుప్రఖ్యాతి సూర్యచంద్రు లున్నంతవఱకు భూమిపై నుండునట్లు ప్రవర్తించినాడు. వీరదేశికుని సేవలో సిద్ధుడు ప్రదర్శించిన నిగ్రహము, మహిమలు, లోకసంస్కారక కార్యములు జగదాదర్శము లైనట్టివి. ఈ నాటికిని కడపమండలమున తిరిగినచో ఈ గురుశిష్యుల ఉదంతములు ఎన్నియో అద్భుతావహములైనవి వినగలము. భక్తులగువారు కొన్నింటిని మాత్రము గ్రంథస్థములు చేసినారు.

ద్వాదశవర్షములు ఎడతెగని శుశ్రూషచేసి గుర్వనుగ్రహమునకు పాత్రుడై సిద్ధుడు సిద్ధుడాయెను. ఈ గురుశిష్యు లిద్దఱు హిందూ మహమ్మదీయ సఖ్యము కొఱకు, సర్వమానవ సౌభ్రాత్రముకొఱకు, దేశకల్యాణముకొఱకు నవాబుల ఆస్థానములకు పర్యటించి, అనేక జ్ఞాన బోధలు చేసి సత్యమతప్రచార మొనర్చిరి. "బ్రహ్మముగారు తమ మతములోని సిద్ధప్పను హైందవునిగా మార్చి మతవిప్లవమును చేకూర్చు చున్నాఁడ"ని అసూయపడిన మహమ్మదీయ ప్రభువులును, మహమ్మదీయ జనసామాన్యమును వీరి బోధలను, సత్ప్రివర్తనమును వినియు, చూచియు సదభిప్రాయ సంపన్నులై "ఉభయమతములకు చెందిన ఈ గురుశిష్యులు కారణ జన్ములగు మహాపురుషులనియు, ధర్మసంస్థాపన మునకే ఈ మహాపురుషుల సంఘటనము ఈశ్వరేచ్ఛగా ప్రవర్తిల్లిన" దనియు తెలిసికొని వారి విశ్వజనీన మతప్రచారోద్యమమునకే తోడ్పడి కృతార్థులైరి. ఆ నాటి తెలుగు సీమలో సశిష్యుడగు వీరగురుని దర్శింపని కన్నులు, వారి బోధామృతమును గ్రోలని చెవులు, అట్లు గ్రోలి పరివర్తనము నందని హృదయములు లేవనెడి జనశ్రుతి అసత్యముకాదు. పరోక్షమున వీరిని ద్వేషించుచున్న ప్రతిపక్షులుగూడ ప్రత్యక్షముగ సంభాషించు నప్పటికి పరమ మిత్రులై దాసానుదాసు లగుచుండెడువారు. ఇత్యాది ఆగురుశిష్యుల ఉదారాశయముల మహిమము, వారి మతసమన్వయ శక్తిలోని ప్రభావము, వారి మానవైక్య ప్రబోధములోని ఆకర్షణము, వారొనర్చిన తపస్సులకు ఫలము కాదని ఎవరనగలరు?

ఎవని యానతి యనన మహీశు లేని
అలరుపెత్తుగా శీర్షములందుఁ దాల్చి
పాలన మొనర్తురి ధార్మికప్రభుత నెఱపి;
అట్టి గురునందు నా చిత్తమలరుఁగాక.

మానవులలో సాధారణముగానుండెడి అవగుణములలో జాతి మతాంతరాసహన మనునది ఒకటి. ఉన్నత జ్ఞానోదయము కానంత వఱకును ఈ గుణమునుండి నరుడు విముక్తుడగుట కష్టము. తనకు భిన్నజాతివానిని, భిన్నమతమువానినిగూడ తన సోదరునట్లు ప్రేమించు బుద్ధి దైవీసంపద నొంది పుట్టినవారికి గాని కలుగనేరదు. చరిత్రను పరిశీలించినయెడల ఆ యా కాలములందు, ఆ యా మతముల ఉన్నతి కోసమై మానవసమాజమున రక్తనదులు ప్రవహించుట, ఆ యా జాతుల అనైకమత్యముచే ప్రాణిజగము పీనుగుపెంటలకు ఆకరమగుట మనము గమనింపగలము. జాతి మత వ్యక్తి ద్వేషములు నశించి, దేశము కల్యాణ మార్గమున పయనించిన శుభదినములు కొలదిగమాత్రమే ఉండగలవు. అట్టిది బుద్ధయుగములో కొంతకాలము గలదు. అద్వితీయమగు ఆత్మ ప్రభావసంపదను దక్కఁగొన్న మహాపురుషులకైనను ఈ మతసామరస్య సంపాదము దుస్సాధమైనట్లు చరిత్రపరిశీలనముచే మనము ఎఱుంగగలము. అయినను, అట్టివారి ప్రబోధవాణి జగమునకు అప్పుడప్పుడు అవసరమే అగుచున్నది

సిద్ధప్ప తన మతమును వీడి వేదాంతమార్గమును అనుసరించుట ఆకాలమున "సిద్ధవటము" నవాబు సహింపలేకపోయినాడు. తాను పాలకుడైయుండగా పాలకవర్గమునకు చెందిన జాతివాడు ఇట్లగుటకు ఆతడు అసూయపడి ప్రతివిధానమును ఆలోచించెను. సిద్ధుని తనయెదుటికి రప్పించుకొని మతము మార్చుకొనుటకుగల హేతువులను అడిగినాడు. బ్రహ్మజ్ఞాన సంపన్నుడగు సిద్ధకుమారుడు సహజ వాగ్విలాసముతో ఉపనిషన్మతమునందలి పరమ సత్యసిద్ధాంతములను హృద్యముగా ఉపన్యసించి, నవాబు హృదయమును ఆకర్షించెను. పూర్వజన్మ సంస్కారములనుబట్టియు, మనఃపరిపాకము ననుసరించియు ఒక వ్యక్తి

స్వాభ్యుదయముకోసము ఇష్టమగు మతమును అవలంబింపుట దోసము కాదనియు, నరునకు సర్వసంశయములను ఛేదించి పరమాత్మ సాక్షాత్కార ద్వారమున ఆత్మశాంతినిగూర్చు మతము ఏదైనను ఆరాధ్యమేయనియు, మతమును ఐహికప్రయోజనమాత్ర సాధనముగా భావింపుకొన్నప్పుడే రాగద్వేషములు కలిగి సంఘమున 'కల్లోలము' ఆరంభ మగుననియు అనేకోదాహరణములతో ఆతనికి నచ్చజెప్పి యంగీకరింపజేసెను. ఎట్టకేలకు సిద్ధోపదేశముచేత సంతుష్టుడైన నవాబు తన్మయుడై వీరగురు దేవునిగూడ రావించి పూజలు సల్పి, సర్వ మత జాతి సామరస్య సిద్ధాంతములను ఆయనచే ఉపదేశింపబడెను. నవాబు ఆ సద్గురూత్తముని బోధకు సంతసించి మడులో, మాన్యములో, అగ్రహారములో కోరు కొమ్మనెనుగాని, గృహస్థసన్యాసి యగు గురుదేవుడు అట్టివాటిని కోరక, కందిమల్లయపల్లెలో మఠమునకు అనువగు కొలదిపాటి నేలను మాత్రమే ఆతని ప్రార్థనమువలన అంగీకరించెను.

వీరేశ్వరుని దినచర్యలలో తెలుగునేల నాలుగుచెఱగులందు తిరిగి ధర్మప్రబోధము చేసి ఆవల యావద్భారత పర్యటన మొనర్చుట ఒకటి గావున, అమ్మహానుభావుడు ఒక్కసారి సశిష్యుడై కర్నూలునవాబు నొద్దకేగి ఆధ్యాత్మికోపదేశములు నొనర్చెను అందు ముఖ్యముగా వేదాన్తము బోధించుచున్న పునర్జన్మసిద్ధాంతము, కర్మవాదము, జన్మ రాహిత్యము, ముక్తి, తత్సాధనములగు భక్తిజ్ఞాన కర్మ యోగమార్గములు అనువానింగూర్చి కర్నూలునవాబు నాస్థానములో మౌల్వీకులకును, వీర దేశికునికిని కొన్నిదినములు అద్భుతములగు వాదోపవాదములు జరిగెను. మహామహిమాభిశోభితుడును, సహజానుభవజ్ఞాన విలాసుడును నగు గురు మూర్తి నవాబునకు కల్గిన సందేహముల నన్నింటిని దూరీకరింపుచు, వేదాన్త సిద్ధాంతములను ఆతని బుద్ధికెక్కునట్లు బోధించెను. తుట్టతుదకు

గురుశిష్యులిద్దఱును రాజధర్మములను, మానవధర్మములనుగూర్చి బోధించి మానవసంఘములో శాంతి, అభ్యుదయము, స్నేహము నెలకొనుటకు తగిన పాలనా విధానములనుగూడ నవాబునకు ఎఱుకపఱచిరి.

## పుష్పగిరిపీఠ సంస్కారణము

గురుదేవుని అవతారోద్దేశ్యములో పీఠాధిపతులను సంస్కరించి, పీఠములను ధర్మ జ్ఞాన ప్రబోధకములుగా ఒనర్చుటకూడ ఒక్కటి యని పాఠకులకు జ్ఞప్తి యుండవచ్చును. ఆ కాలమున అతిసనాతనములగు గాయత్రీ, సావిత్రీ, సరస్వతీ పీఠములును, శ్రీ శంకరభగవత్పాదులనాటి నుండి ప్రచారమునకు వచ్చిన శృంగేరీ పుష్పగిర్యాది పీఠములును బహుళ ప్రచారములో ఉన్నవి. గాయత్ర్యాది పీఠములు విశ్వబ్రాహ్మణుల పాలనమునందును, శంకర పీఠములు కొన్ని వైదిక బ్రాహ్మణులపాలనము నందును కలవు. పుష్పగిరిలోని శంకరపీఠము వీరదేశికునికి సమీపస్థము. ఆ కాలపు పుష్పగిర్యగ్రహారికులు వేదవిద్యావర్చస్సుచేతను, ఉన్నత జాత్యభిమానముచేతను స్వధర్మమునకు దూరులై శంకరోక్తధర్మములను విస్మరించి తిరుగుచుండిరి. ఈ పరిస్థితులలో ఒకనాడు సకుటుంబుడు, సశిష్యుడు అగు వీరగురుడు ఆ అగ్రహారమునుండి కడపకు పోవు చుండెను. ముందు సిద్ధుడు ఈశావాస్యోపనిషత్తును పారాయణమొనర్చుచు నడచుచుండెను. పుష్పగిరిలో ప్రవేశించునప్పటికి విప్రులు అడ్డగించి జాతి మతముల నడిగి కలహము పెట్టుకొనిరి. సిద్ధుడు వారి ప్రశ్నముల కన్నింటికిని తగిన సదుత్తరములను శ్రుతిప్రమాణ సహితముగా ఇచ్చు చుండెను. పండితులకు ఈతని వాగ్ధోరణి అసహ్యమయినది. వారు తమ కోపు తగ్గిపోవుటకు మఱింత మండిపడుచుండిరి. నోటికి వచ్చినట్లు వీర గురుదేవునిగూడ తూలనాడిరి. ఇంతలో గోవిందమాంబాసమేతుడై

శిష్యులతో గురుడును వచ్చెను. కులభేదమునుగూర్చిన గుణకర్మవాద రహస్యమును గురులు ఉగ్గడించిరి. ఉభయులను శాంతపఱుప జూచిరి. పండితమ్మన్యుల ఉద్ధతి నిందావాక్యములతో ఆగక శిలావర్షమునుగూడ కురిపించెను అమ్మవారికి కూడ దాయి తగులుటచే సిద్ధుడు కుపితుడైనాడు. బ్రహ్మహృదయము చంద్రోదయారంభమున అంబురాశివలె ఇంచుక కలంగినది పుష్పగిరి గ్రామమున హుతాశనచ్ఛటలు ఆవరించినవి. గొల్లుమనిగోల! అగ్రహారమంతయు వచ్చి దేశికేంద్రుని చరణముల వ్రాలినది. వృద్ధపండితులు ఉద్ధతపండితులను మందలించి "గురుచరణం మమ శరణం" అనిపించిరి. అగ్నిహోత్రుడు ఆత్మలీలను ఉపసంహరించినాడు. గ్రామము తగులబడ్డదా ? లేదు. అంతయు యథాపూర్వమే !

పీఠాధిపతులతోగూడ పండితమండలికి గురుప్రభువు, ఉపనిషత్తత్త్వోపదేశము చేసినాడు అనేక ప్రశ్నములు. అన్నింటికి తగిన సమాధానములు. ఆ నాడు పుష్పగిరిలో వేదాన్తసూత్రసారము కాలువలుగట్టి ప్రవహించినది. నగరమంతయు నూత్నశోభను సంతరించుకొన్నది. ప్రతివాని హృదయమును పరమాత్ముని సన్నిధానముననే చెంగలించినది. ఎల్లరిచూపులును గురుదేవుని పాదపద్మములందే వ్రాలినవి. ఇట్టి మహాయోగీశ్వరునికి, జ్ఞానికి, కర్మయోగికి అర్హమగు పూజ యేది ! పీఠాధిపతుల యాజమాన్యమున అఖండ బ్రహ్మరథ మహోత్సవము స్వస్తిమంత్ర పాఠములతో సాగిపోయినది. పీఠాధిపతులగువారు నెఱపవలసిన ధర్మమును సాంగముగ ఉపదేశించి గురుదేవుడు ఉత్తమ సంస్కారమొనర్చెను. శంకరహృదయమును అనుసరించుటకు ప్రేరేపించి గురువులకు గూడ గురూత్తముడై గురుచక్రవర్తి తేజరిల్లెను పీఠాధిపతులగు గురువులకుగూడ కర్తవ్యోపదేశ మొనర్చిన ఈ ఒక్క అంశమే గురు

దేవుడు అవతారమూర్తి యని చాట జాలును. పుష్పగిరిపీఠమునకు గురుదేవు నర్పించిన సంస్కారబోధ సాటిలేనిది. దానిని సమస్త పీఠాధిపతులు అనుసరించినచో, పీఠములు ప్రజాసంస్కరణ సాధనములై, ప్రజోపకార సమర్థములుగా తేజరిల్ల గలవు.

"నిందగొనుమాత్రఁ బురమెల్ల నిండె నగ్ని
పదము పట్టినమాత్రానఁ బఱచె నౌర!
అకటకట కర్మమహిమ నేమనఁగవచ్చు
నన్నిటికి సాక్షి యీశ్వరుఁ డతఁ డొకండె."

—శ్రీ నిరంజనశాస్త్రిగారి కల్యాంధకౌముది.

## గురుదేవుని వేదాంతము

"అనధిగతే వేదాన్తే కలిమలకలుషే జనే సదా చరతి
వీరబ్రహ్మాభిధయా సమజని లోకే హి శాంకరం తేజః."

—శ్రీపుట్టపర్తి నారాయణాచార్యులుగారు.

వేదాంత తత్త్వము తెలియబడక కలిదోషమలిన చిత్తులై జనులు చరించునప్పుడు, పరమశివతేజము వీరబ్రహ్మనామముతో లోకమున అవతరించెను.

బ్రహ్మముగారు ప్రబోధించిన వేదాన్తసిద్ధాంతమేది? ద్వైతమా? అద్వైతమా? విశిష్టాద్వైతమా? శైవమా? వైష్ణవమా? తదతీతమా? సగుణమా? నిర్గుణమా? అచలమా? అని పలువురు పలురీతుల ప్రశ్నించుచుందురు. బ్రహ్మగురుని బాల్యకాలము శైవ సంప్రదాయమునకు చెందిన పాపాగ్నిపీఠ పాలకులవద్ద గడచినదని మన మెఱింగియే

యున్నాము. ఈ పాపాగ్నిమఠము కన్నడదేశమునందలి చిక్కబళ్లాపుర ప్రాంతమున నున్నది. కర్ణాటకము కొన్ని వందల సంవత్సరముల నాడే బసవేశ్వరుని శైవమతముతో నిండిపోయిన దనుట విస్పష్టము. ఆకారణమునగాని, సహజముగా ఆయనలో శైవ వైష్ణవాంశములు కలసియున్నందునగాని గురుదేవుడు శైవాచార పరాయణుడు గానే కన్పట్టుచున్నాడు. అయినను వైష్ణవ పరాఙ్ముఖత్వము లేదు పెక్కు కాలజ్ఞానగ్రంథములు గురుదేవుడు విష్ణ్వవతారమని గూడ వాకొనుచున్నవి అంతమాత్రముచేత శైవమత పరాఙ్ముఖత్వముగూడ ఆయనలో అగపడదు. అల్లాడుపల్లెలో వీరభద్రస్వామిని ప్రతిష్ఠించి ఉపాసించుట, విభూతి రుద్రాక్షమాలా ధారణాదులు, దేవీపూజా-పంచాక్షరీ మంత్రోపాసనాదులు ఆయన శైవాచార సంప్రదాయమునకు నిదర్శనములు. ఆయన అవతారోద్దేశ్యములలో యోగోద్ధరణముకూడ ఒక్కటియైనందున, సర్వయోగీశ్వరేశ్వరుడగు పరమశివునిమీద ఆయనకు ప్రీతియుండుట సముచితముగానే యున్నది. యోగులకందటికిని శివతాత్పర్యముండుట సహజమే కావున, శిష్యశిక్షణార్థముకూడ ఆయన శివప్రీతిని ప్రకటించినా దనవచ్చును. గురుదేవునిలో "శివాయ విష్ణురూపాయ శివరూపాయ విష్ణవే" అన్న శివకేశవాభేదజ్ఞాన మొక్కటే పాదుకొని లేదు "ఏకం సత్ విప్రా బహుధా వదన్తి" అన్న పరమాద్వైత బ్రహ్మభావమే తావు చేసికొని యున్నందున, ఆయన శివ కేశవాదులయెడనేకాక, తక్కిన సర్వదేవతలయందును పరమ నిర్గుణ బ్రహ్మభావమునే కలిగి యున్నాడనుట రహస్యము. తాను తపస్సు చేసికొనుటకు నిర్ణయించుకొన్న ప్రదేశము 'హరిహరపుర' మగుటగూడ పై యభిప్రాయమునే బలపఱచుచున్నది. మాయాకల్పితములగు నామరూపములకు గురుదేవుని దృష్టిలో ఎప్పుడును ప్రాధాన్యము లేనేలేదు. ఆయనకు పరమారాధ్యమైన తత్త్వము సచ్చిదానంద ఘనమైనట్టిది అది ఏ రూపములో ఉన్నను, ఏ నామముతో పిలువబడుచున్నను, ఉపాసకులు

రాగద్వేషములు పూనక, దానిని ఆరాధింపవలయుననియే గురుచంద్రుడు ప్రబోధించుచుండువాడు. సగుణ నిర్గుణారాధనములయెడగూడ అమ్మహనీయునికి సమానభావమే కలదు. సాధకుల మానసిక స్థితినిబట్టి ఆ యా తత్త్వములు ఉపాస్యము లగుచుండునని యెఱింగిన తత్త్వజ్ఞులు దేనిని గూడ చిన్నచూపు చూడరుగదా ! మహమ్మదీయాది మతములయెడనే సామరస్యమును ప్రకటించిన మహనీయుడు ఒక్క వైదిక మతములోని అల్పాల్ప భేదములకు ఆదరానాదరములను చూపునా ? పరిపూర్ణజ్ఞాన సంసిద్ధిని పొందిన మహనీయులు ఎప్పుడును భేదాతీతులుగానే సంచరించుచుందురు. కొందఱు గురుదేవునిది అచల మతమని తలంతురు. ఆ అభిప్రాయముగూడ పూర్ణ సత్యము గాదు. ద్వైత విశిష్టాద్వైతములయెడ సైతము గురుదేవునికి నిరసనభావము లేదు అవి అన్నియు సాధకుల అధికారమును బట్టి ఆచరింపదగిన దశావిశేషములని గురుని యభిప్రాయము.

ఈయన కిష్టమైన తత్త్వమార్గము ఉపనిషత్ప్రతిపాద్యమైన అద్వైత సిద్ధాంతమే. ఏ అద్వైత సిద్ధాంత ప్రచారముకోసమై శంకరులు ప్రస్థానత్రయమునకు భాష్యములు వ్రాసియున్నారో, అదే గురుదేవునికి ఇష్టమైన వేదాన్తసిద్ధాంతము. నిర్గుణ తత్త్వ ప్రధానమగు ఈయన వేదాన్తము సగుణులైన ఆ యా దేవతల పారమ్యమును దాటి "అహం బ్రహ్మాస్మి" అన్న మహావాక్యములో అనుభవరూపమున సమన్వయించుచున్నది. 'ప్రజ్ఞానం బ్రహ్మ' (ప్రజ్ఞానమే బ్రహ్మస్వరూపము) 'అయమాత్మా బ్రహ్మ' (ఈ ఆత్మయే బ్రహ్మము) 'తత్త్వమసి' (ఆ అఖండ బ్రహ్మము నీవే) 'అహం బ్రహ్మాస్మి' (నేను బ్రహ్మమును) అన్న మహావాక్యార్థములు సర్వవేదాంతులకును తెలిసికొనదగినవి; అనుభవమునకు తెచ్చుకొన దగినవియునై యున్నవి. మహావాక్య ప్రధానమగు అద్వైత

వేదాంతమునకు యోగముతో పొత్తుగూర్చి గురుదేవుడు ఒకవిశేషమును సంపాదించినాడు. ఈయోగ,వేదాన్తముల కలయిక సాధక ప్రపంచమునకు వెలలేని ఫలమును పండించి యిచ్చినది. శుష్క వేదాంతము కూలిపోయి అనుష్ఠాన పూర్వక వేదాంతప్రజ్ఞ వికసించినది. కావుననే గురుదేవుని వేదాంత సంప్రదాయమునకు చెందినవారందఱు తమ ప్రాణప్రయాణ సమయము నెఱింగి,జీవములుండగనే సమాధులలో ప్రవేశించినారు. జ్ఞాన, యోగ ప్రధానమైన ఈ తత్త్వమార్గములో వైదికమగు కర్మకాండమునకు చోటు లేదు. మంత్రానుష్ఠాన దేవతారాధన రూపమైన ఉపాసనకు మాత్రము కొంతవఱకు తావున్నది ఇందు ఆత్మసంస్కరణమునకు, ఆత్మజ్ఞానమునకే ఎక్కువ ప్రాధాన్యము గురుదేవుని వేదాంత సిద్ధాంతములు, మంత్రయోగానుష్ఠానాది సాధనవిశేషములు, ఆయన వ్రాసిన "కాళికాంబహంస కాళికాంబ" అను మకుటముగల పద్యములలోను, పెక్కులగు గేయములలోను, గోవిందవాక్యములలోను, వచనములలోను విస్తరింపబడి యున్నవి. మచ్చునకు ఒకటిరెండు చూతము.

"బ్రహ్మ మనగ వేఱె పరదేశమున లేదు
బ్రహ్మ మనగ జూడు బట్ట బయలు
తనకు తానె బ్రహ్మ తారక మవు నయా
కాళికాంబ హంస కాళికాంబ!"

"అంతా బ్రహ్మమయం బని
నంతసమున దిరుగువారు సర్వజ్ఞులు: శ్రీ
కాంతుని కృపచే వారికి
చింతలు లేవయ్య! యోగసిద్ధులు సిద్ధా!

సంసారిగా ఉండియు సర్వము బ్రహ్మమయమనెడి ఆరూఢజ్ఞానము గలవాడే రాజయోగియని దిగువ పద్యములో వాకొనుచున్నాడు—

"సంసారమందు నుండియు
సంసారము మిథ్య జేసి సర్వము తానై
సంసారంబును గెలిచిన
సంసారే రాజయోగి సత్యము సిద్ధా !"

వీరగురునికి శక్తిమంతములగు బీజాక్షరములతో గూడిన మంత్రములపై గల సదభిప్రాయము ఈశ్వరమ్మగారు చెప్పిన దిగువ వాక్యములలో స్పష్టమగుచున్నది.

"భక్తిగలిగి మనసందున మంత్రము మానకనడపండన్నాడు.
మంత్ర తంత్రములు మాయగాదు ఇక మర్మం బిడియనియన్నాడు.
తెలిసిన భక్తులు తెలియనివారికి జ్ఞానము తెలుపండన్నాడు.
రేయి పగలు మా ద్వాదశాక్షరీ మంత్రము నడపండన్నాడు."

గురుదేవునికి గల ఈ తత్త్వదృష్టి ఆ నాటి పీఠాధిపతులకు లేదు. వారు స్వార్థపరులై గుణకర్మములకు ప్రాధాన్యమీయక ప్రజలను బెల్లించుకొని తినుచుండిరి. ఇట్టి పీఠములను సంస్కరింప వీరదేశికుడు దీక్ష పూనినాడు. ఈదీక్షలో ఆయనకు పుష్పగిరిలోని శంకరపీఠము మెట్టమొదటి రంగస్థలమైనది. ఈ సందర్భముననే ఈతడు శంకర మార్గమును ఖిలము కానీయక రక్షించినాడనవలయును. తన కాలమున వేదాన్తమునకు పాటిల్లిన దుర్గతిని పోనణచి, సామాన్య ప్రజలకుకూడ యోగవేదాన్త రసాయనము నొసంగి, జ్ఞానబలసంపన్నుల నొనరించుటకే ఆయన తేటతెలుగున తత్త్వసారస్వత నిర్మాణము చేయవలసివచ్చినది. అతీతమగు పరమ తాత్త్వికదృష్టితో జూచినప్పుడు - తురీయాతీత స్థితిని పడసినప్పుడు-ద్వైతముగాని, అద్వైతముగాని లేదని శివుడు పార్వతీ

దేవికి ఉపదేశించినాడు. పరమశివతత్త్వము, లేదా - పరమాత్మ తత్త్వము అట్టిది.

"అద్వైతం కేచి దిచ్ఛన్తి, ద్వైత మిచ్ఛన్తి కే చన,
మమ తత్త్వం న జానన్తి, ద్వైతాద్వైత వివర్జితమ్.''

— అన్నట్లు గురుమహాదేవుని మార్గము ద్వైతాద్వైతాది భేదములను నిరాకరింపని సర్వాతీతమైనట్టిదని ఆయన చర్యలును, బోధలును సుస్పష్టము చేయుచున్నట్లు గ్రహింపవచ్చును. ఒక్క గురుదేవుడే కాదు, పరమాతీత సంసిద్ధిని పొందిన మహనీయులందఱును ఆ మార్గములోని వారే అని అనుభవసంపన్నులకు చెప్పబనిలేదు.

## వేదాంత సారస్వత సృష్టి

ఎవఁడు శ్రుత్యంతముల నెల్ల నేర్పఱించి
తెలుఁగు "తత్త్వాల" లోఁ బ్రబోధించినాడొ,
ఆ త్రయీమూర్తి రుచిర పాదాబ్జసీమఁ
జేరి నటియించుఁ గాత నా చిత్తభృంగి.

సహజకవియగు గురుచంద్రుడు వాఙ్మయ విషయమున నొనర్చిన సేవయు అమూల్యమైనట్టిదే. ప్రాచీనకాలమునుండియు వేదాంతార్థములు సంస్కృతభాషలోనుండి బోధింపబడుచున్నవి. తెలుగులో మార్గకవిత వెల్వడి పురాణాది గ్రంథములు తెనిగింప బడిన నాటినుండియు కొంత వఱకు సంస్కృతాపేక్ష సడలినను, ఆంధ్రీకృత గ్రంథార్థములుగూడ భాషాజ్ఞానము కలవారికే తెలియ వీలగునట్లుండెను. అయినను తెలుగుసీమలో మొదటినుండియు, ద్విపదలు, రగడలు, ఏలలు, పదములు,తత్త్వములు—

అనుపేర్లతో కొన్నివిధములగు గేయములు ప్రచారములో లేకపోలేదు. ఈ గేయసారస్వతమును పదకవిత్వమనియు పేర్కొందురు. జనసామాన్యమునందు సులభముగా విషయములను వ్యాపింపచేయుటకును, బహుళ ప్రచారమునకును ఈ విధమైన రచనలే తగినవై యున్నవి. ఎట్టి గంభీరార్థము నేనియు జానుతెనుగున పైని చెప్పిన గేయములలో నిబంధించిన యెడల, అవి సజీవములై జనసమూహమునందు నాటుకొని పోయెడివి. ఈ అంశమును గురుదేవుడు గుర్తించినాడు. వేదములయందును, ఉపనిషత్తులయందును, తదితర దర్శనాది గ్రంథములయందును గల వేదాంతరహస్యములను ఏలలలోను, తత్త్వములలోను, కందము, ఆటవెలదులవంటి చిన్న చిన్న పద్యములలోను ప్రవచించి శిష్యసంతాన ద్వారమున ప్రచారమొనర్చినాడు. "నేనే బ్రహ్మమురా ! పామరులార, నేనే బ్రహ్మమురా" అని చెప్పగలిగిన వీరగురుని తత్త్వసారస్వతాంధ్రీకరణ మార్గము లోకోత్తరమైనది. దానిని పూర్తిగా ఈచిన్నిపుస్తకమున వివరింప వలనుపడదు. గురుపాదుల యడుగుజాడలను బట్టియే సిద్ధప్పయు గొప్ప తత్త్వ వాఙ్మయమును జానుతెనుగులో సృష్టించి చెన్నొందినాడు.

వీరగురుఁడు ప్రాచీన తత్త్వ వాఙ్మయమును తేట తెనుగున వ్రాయుటేకాక, ఆ కాలపు ప్రజలలోనున్న మూఢవిశ్వాసములను, కల్పిత సిద్ధాంతములను ఖండించుటకుగూడ, మనోహరములగు పాటలను, గేయములను సంవాదరూపముగాగూడ రచించెను. ఇట్టి వానిని నేటికిని బిచ్చగాండ్రనోటను, బైరాగులనోటను మనము వినుచుందుము. పామరుల నోటబడి అవి వాటి కలరూపునుగూడ గోల్పోయి వికృతములయినవి. గురుదేవుని రచనలలో "కాళికాంబ హంస కాళికాంబ" అనుమకుటముతోనున్న పద్యములు, 'సిద్ధా, కాళి' అన్న సంబోధనములతోనున్న పద్యములను సుప్రసిద్ధములయినట్టివి గోవింద వాక్యములయు, కాలజ్ఞాన

తత్త్వములయు ప్రసిద్ధి ఇంతింతని చెప్ప నలవికానిది. త్రికాలజ్ఞుడగు గురుమూర్తి అత్యాశ్చర్యకరములగు భవిష్యదంశములగూడ పెక్కింటిని తన రచనలలో నిమిడ్చి ప్రచారముచేసెను. ఈ నాడు జరుగుచున్న సాంఘిక పరిణామములు, రాజ్యాంగ పరిస్థితులు, ప్రజలమనోభావములు, మతకలహములు, నానావిధ సాంకర్యములును వీరగురుని తత్త్వవాక్యములలో మనము ఆరయగలుగుదుము. సంఘములోని మూఢాచార విశ్వాసములను, అర్థరహిత సంప్రదాయములను మోమోటపడక ఖండించిన వారిలో వీరబ్రహ్మము వలె వేమనయోగియు అగ్రేసరుడే. ఈ యోగీశ్వర సార్వభౌమద్వయముతో పోల్పదగినవారు ఆంధ్రదేశములోనే కాదు, భారత దేశమునందును ఎందఱుందురో! కబీరు మున్నగువారు కొలది పాటిగమాత్రమే యుందురు. కీ. శే. కట్టమంచి రామలింగారెడ్డిగారికి ఈ యోగిద్వయముమీద అపార భక్తిగౌరవము లుండెడివి. వీరిసారస్వతమును ఆయన ఎంతగానో ప్రేమించెడివాడు. మన దురదృష్టవశమున వీరబ్రహ్మ వాఙ్మయము సురక్షితము కాలేదు. వేమన యోగీశ్వరుని పద్యవాఙ్మయము కొంతకు గొంతయైననునేడు చిక్కినది ఈ నాటికైనను వీరగురుని తత్త్వ సారస్వతమును సంపాదింపపూనుకొన్నచో అది కొంత యైనను దొరకక పోదు. ఈ కార్యమునకు కందిమల్లయ పల్లెలోని బ్రహ్మముగారి మఠాధిపతులు శ్రద్ధ చూపినచో పని సాగ గలదు.

నేడు మనకు దొరకిన వాఙ్మయ మంతయు వీరగురునిదో, ఆయన గారి శిష్య ప్రశిష్య వర్గముదో అయితీఱునని మనము భ్రాంతిపడరాదు. ఇందు ఆ యా కాలములయందు ప్రక్షిప్తమైన భాగముకూడ కొంత యుండవచ్చును. ఈ ప్రక్షిప్తమను దుర్దశ ఏ మహారచయిత వాఙ్మయమునకైనను పట్టుట వింతకాదు. స్వార్థపరులు తమ విచిత్ర సిద్ధాంతము

లను మహాత్ముల అండదండలతో ప్రచార మొనర్చుకొననెంచి, ప్రక్షిప్త కార్య చతురులై పుణ్యము గట్టుకొందురు. అయినను గురుదేవుని సంపూర్ణజీవిత పరిచయముచేతను, మఠములో సురక్షితములై యున్న కాలజ్ఞానాది గ్రంథముల సాయముచేతను దొరకిన వాఙ్మయములోని పొల్లును తీసివేసి మంచి సరకును సేకరించుకొనవచ్చును. ఇందుకు సమర్థులు తత్త్వజ్ఞులునగు పండితులు పూనుకొన్నచో కార్యము నెఱ వేఱగలదు.

ఉపమానమును మాత్రమే చెప్పి ఉపమేయమును తోపింప జేయుటను రూపకాతిశయోక్తి అందురు. బ్రహ్మముగారి గద్య పద్య గేయములు పెక్కులు రూపకాతిశయోక్తిలోనే ఉండును. గురుమూర్తి ఒక తత్త్వములో "మూడు కాల్వలు దాటలేరన్న ఈ మూఢజనులు మూడు కాల్వలు దాటలేరన్న" అన్నాడు. అందలి మూడుకాల్వ లనెడి ఉపమానముచేత ఇషణత్రయమును అనగా ధనేషణము (డబ్బుమీదికోరిక) దారేషణము (భార్యమీదివాంఛ) పుత్రేషణము (బిడ్డలమీది కోరిక) అను ఉపమేయ పదార్థములను గ్రహింపవలసి యున్నది. అట్లే ఇంకొకచోట "మూడారు వాకిళ్ల మూయవలె నన్న" అనును. అచ్చట వాకిళ్ళనుమాట శరీరము లోని నవరంధ్రములను సూచించుచున్నది. ఇంకొకచోట "ఆరిటి మీదనె చిద్రూపం" అనును. అక్కడ ఆఱుఅనగా ఆధారాది షట్చక్రములని తెలియవలయును ఆధారాది షట్చక్రములను దాటి, ఏడవదగు సహస్రార మునకు ఏగిననే కదా సాధకుడు చిత్కళా సందర్శనము చేయునది! శ్రీ వేలూరి శివరామశాస్త్రిగారు కోలవెన్ను పరబ్రహ్మతీర్థులవారి 'జగచ్ఛిల్పగ్రంథము' నకు అభిప్రాయము వ్రాయుచు "బ్రహ్మంగారి రూపకాతిశయోక్తియు (Mysticism) వ్యతిరేకలక్షణయు అన్యదుర్లభ ములు!" అని పలికినారు ఇది ఎంతయు సత్యము కావుననే బ్రహ్మము

గారి వాక్యములకు పెక్కింటికి అర్థము తెలియక పాఠకులు చిక్కుపడు చుందురు. ఈ సందర్భమున గురుదేవుని ఒకటి రెండు తత్త్వము (గేయము)లను చవిచూచుట అప్రస్తుతము కాదు.

1. రాగము: నాదనామక్రియ. ఏకతాళము

ఆనందమయుడు గావలెను-పూని
తాను తానైయున్న తావు గనవలెను, ॥ఆ॥
కామమును కడకొత్తవలెను-అష్ట,
సామజములమదము సమయింపవలెను. ॥ఆ॥
ప్రేమ సద్గురు జేరవలెను-దుష్ట,
తామసపు దుర్గుణము తొలగింపవలెను. ॥ఆ॥
సత్యమే మది నిల్పవలెను-అ
సత్యదేహము మీద ఆశ విడవలెను. ॥ఆ॥
భక్తి మదిలో నిల్పవలెను-జీవ
న్ముక్తిమార్గము తాను ముందెఱుగవలెను. ॥ఆ॥
అక్షరాత్మకుడు కావలెను-మూడు
అక్షరములభావ మది తెలియవలెను. ॥ఆ॥
దీక్షాధికారి గావలెను-జన్మ
మోక్షకాంక్ష గురుని పూజింపవలెను. ॥ఆ॥
నిద్రరాకడ తెలియవలెను-పైని,
భద్రముగను యోగనిద్ర పోవలెను. ॥ఆ॥
చిద్రూప మపుడె కనవలెను-భద్ర
ముద్ర కీలెఱిగి సద్గతి బొందవలెను. ॥ఆ॥
వేష భాషలు మానవలెను-తన్ను
దూషించినవారి భూషించవలెను. ॥ఆ॥

చూపు మనసొకటి చేయవలెను_సర్వ
వ్యాపకుండౌ చిన్మయాత్మ గనవలెను. ॥ఆ॥
మేడమీదికి జేరవలెను_అచట,
జోడుబాయక హంస గూడగావలెను. ॥ఆ॥

ఈ తత్త్వమున యోగియగువాడు కామనిగ్రహమున గెలుపొంది, అష్టమదములను అణంచవలెననియు, బ్రహ్మేతరమైన మిథ్యాజగమున దృష్టి ఉంచరా దనియు, అకార, ఉకార, మకారాత్మకమగు ఓంకార తత్త్వమును అనుసంధానము చేయవలె ననియు, సద్గురునాశ్రయించి, ఆయన అనుగ్రహముచే తురీయమైన యోగనిద్రా సుఖమును అనుభవింప వలె ననియు, దూషణ భూషణ తిరస్కారములను లెక్కచేయక, సర్వ వ్యాపక చిన్మయ బ్రహ్మదర్శనము చేసికొనుచు, ఏడవదైన సహస్రార మున పరమాత్మనుగూడి రమింప వలెననియు తత్త్వరహస్య మంతయు ప్రబోధింపబడినది. అంతియేకాని, కేవల వేషభాషలు ముక్తిదాయకములు కావనియు స్పష్టము చేయబడినది

## తత్త్వం – 2

శివపంచాక్షరి మంత్రం పరశివయోగులకే జపసూత్రం,
అవిరళయోగం బందినవారికి ఆరిటిమీదనె చిద్రూపం. ॥శివ॥
అయిదుముఖంబుల పెరిగినదీ, అయిదక్షరముల అమరినదీ,
అయిదయిదులు ఇరువదియైదౌ అఖండతేజం బీమంత్రం. ॥శివ॥
మూడుత్రోవలది సాకారం, మూటినడుమనే శ్రీకారం,
చూచేదంతయు సాకారం చూపునిలిపితే నిరాకారం. ॥శివ॥
సుషుమ్నాంతమున గురుతేజం, అష్టకమలమున శివరూపం,
సహస్రారమున పరబ్రహ్మ శ్రీగురువీరేశుని ఘనతేజం. ॥శివ॥

ఈ తత్త్వమున పంచాక్షరీమంత్ర ప్రభావమూ, పంచసంఖ్యా రహస్యమూ, పంచవింశతి తత్త్వములూ సూచింపబడుటయే కాక, ఆపైటి మీది దైన సహస్రారమున సాక్షాత్కరించెడి చిత్స్వరూపము కూడ ప్రస్తావింపబడినది మహాయోగీశ్వరుడగు బ్రహ్మగురుడు సహస్రార మును, అక్కడకు జీవుని చేర్చెడి సుషుమ్నామార్గమును ఏ సమయము నందును మఱువడు; శిష్యులనుకూడ మఱువనీయడు. ఇది రాజయోగుల శుభలక్షణము.

## తత్త్వం - 3

మాయను నఱికినవాడు, గురు
రాయనిలో జతగూడు;
పాయుచు విషయము రోయుచు తత్త్వము
ఏయెడ జూచిన ఏకము తానై. ॥మా॥

కుండలి నిటు భేదించి, ఆ
ఖండముగను భావించి,
అండ పిండ బ్రహ్మాండములంతట
నిండి పండి యా నిర్వికల్పమున. ॥మా॥

ఈతత్త్వమున మాయను మంటగలుపుట, సద్గురుమూర్తి నాశ్రయించుట, విషయములను రోతగించుకొనుట, తత్త్వమును వెదకుట, కుండలిని భేదించుట - అనెడి మహావిషయములు సూచింపబడినవి. వేదముకూడ "ఆచార్యవాన్ పురుషో వేద' సద్గురు నాశ్రయించువాడే జ్ఞాని కాగలడను చున్నది కనుక గురూపసదనము అందఱకును ఆవశ్యక మన్నమాట!

## ఈశ్వరమ్మగారు

ఆదిశక్తియగు జగదీశ్వరి అపరావతారమని ప్రసిద్ధిగన్న ఈశ్వరమ్మను మన మింతవఱకు దర్శింపలేదు. ఈమె గురుదేవుని పెద్ద కుమారుడగు గోవిందయ్యగారి కూతురు; అఖండ బ్రహ్మవాదిని. తాతగారగు జేజినాయనకు పలువిషయములందు సాటిలేని సలహాల నిచ్చుచు, వేదాన్తప్రచారమునకు తోడ్పడిన మహాయోగిని ఈమె. ఈమె దాదాపు నూఱేండ్లకాలము జీవించి, జీవితకాల మంతయు బ్రహ్మచారిణిగానే గడపినది. తనకు వివాహ మక్కఱలేదనియు, తన యవతారోద్దేశ్యమును తాను నిర్వహించుకొనుటే తన లక్ష్యమనియు ఈమె ప్రజాసేవ యొనర్చి కృతార్థురాలయినది. ఈమె అవివాహిత యైనందువలనగూడ బ్రహ్మముగారి కుటుంబము సాంఘికముగా కొన్ని ఇక్కట్టులకు గుఱికావలసి వచ్చినది. ఆ కాలమున స్త్రీలు అవివాహితలై ఉండునాచారము లేదుకదా! పైపెచ్చు ఎనిమిదేండ్లకే పెండ్లిచేయు అనాచారముండెడిదాయెను. ఇట్టి స్థితిలో దేశసేవాతాత్పర్యముతో ఉండగలిగిన స్త్రీలు, బ్రహ్మచారిణులయి ఉండవచ్చునని ఈశ్వరీదేవి తననే దృష్టాంతముగా నిరూపించి, ఒక మహనీయాదర్శమును స్థాపింపగలిగినది.

ఈశ్వరమ్మగారుగూడ గద్య పద్య గేయ వచన రూపమైన తత్త్వ సారస్వతమును ఎంతయో నిర్మించినది. స్త్రీ జనాభ్యుదయమునకు అనువగు పాటలు, ఏలలు వ్రాసినది. తన పితామహునివలెనే తానుకూడ భవిష్యద్విషయములతో నిండిన కొంత కాలజ్ఞానమును రచించినది. ఒక్క ఈశ్వరమ్మయే కాదు, గురునిభార్య గోవిందమ్మ, కుమారులుగూడ కొన్ని రచనలు చేసినారు. వేయేల! శ్రీవారి కుటుంబ మంతయు మానవ సంస్కృతికి అవసరమగు వాఙ్మయమును నిర్మించి సారస్వత సేవ చేసినట్టిదే. ఈ వాఙ్మయ మంతయు పరిశుద్ధమగు వ్యావహారిక భాషలో

నుండి పండితపామరుల ధన్యవాదములకు అర్హమైయొప్పుట నేటి సారస్వతోపాసకులు గర్వింపదగిన అంశము. దరిదాపు నాలుగు వందల యేండ్లనాడే భాషాసంస్కారమునకు త్రోవచూపి, తెండవ వాగనుశాసనుడును, కవిబ్రహ్మయునై ఒప్పిన గురుదేవుని సారస్వతసేవా ఫలములు ఈ నాటి తెలుగువారి నాలుకలపై నిండు తేనెవాకలను జాలువారజేయు ప్రయత్నము మనకు అవసరము కాదా ?

ఈశ్వరీదేవి ప్రశంస వచ్చినదికాన ఒక అంశమును ఇచ్చుట తడవక తప్పుట లేదు. ఇప్పటికి బ్రహ్మముగారి చరిత్రమును వ్రాసిన కొందఱు రచయితలు ఈశ్వరమ్మ బ్రహ్మముగారు సమాధియైన పిమ్మట పుట్టినదని వ్రాసియున్నారు. బ్రహ్మముగారి నాటకమును యక్షగానముగా వ్రాసిన కీ॥ శే॥ కడియాల వీపూరయాచార్యులవారు మాత్రము ఈశ్వరి బ్రహ్మము సమాధి కాకముందే పుట్టినదని వర్ణించియున్నారు బ్రహ్మముగారి చరిత్ర రహస్యములను పెక్కింటిని నాకు ఉపదేశించిన నా పితృదేవులును అట్లే భావించినారు నాకును అదే సత్యమని తోచినది దీనికి తోడు ఇటీవల ఈశ్వరమ్మగారి కాలజ్ఞానమను పుస్తకమును జూడగా అందు ఆమె తాతగారి కాలమునందే ఉన్నట్లు తేలినది. ఈ అంశమును గూర్చి రచయితలు ఇంకను పరిశోధింప వచ్చును.

## కాలజ్ఞానరచనము

"శ్రీ విరాట్పద విఖ్యాతం సిద్ధానంద ప్రదాయకమ్
కాలజ్ఞాన ప్రవక్తారం వీరబ్రహ్మగురుం భజే"

— కీ. శే. పులికొండ పరబ్రహ్మకవిగారు.

విరాట్టు అను శబ్దముచే ప్రసిద్ధమైన వాడును, సిద్ధపురుషులకు ఆనందమును కూర్చు వాడును, కాలజ్ఞాన ప్రవచన మొనర్చిన వాడును నగు శ్రీ వీరబ్రహ్మగురు దేవుని భజించుచున్నాను.

వీరబ్రహ్మగురుని వలన మనకు లభించిన తఱుగని పెన్నిధానము కాలజ్ఞానము. ఈ కాలజ్ఞానమును జెప్పెడి ఆచారము శైవసిద్ధులలో సహజముగా కలదు. నా కర్ణాటదేశ పర్యటన సందర్భమున అనేకుల కాలజ్ఞానగ్రంథములను చూచుట సంభవించినది. ఆ సంప్రదాయమును నానా వృద్ధిచేసి, జనసమూహమునకు భవిష్యత్కాల స్వరూపమును బోధచేసి యీ మహనీయుడు లోకస్తుతులకు పాత్రుడైనాడు. గురుదేవుని జీవితచర్య యంతయు ఒకయెత్తు, కాలజ్ఞాన ప్రవచనము ఒకయెత్తు అని చెప్పవచ్చును. వీరి కాలజ్ఞానమునకు అసాధారణ ప్రచార మున్నది. గురుదేవుడు కాలజ్ఞానములో వ్రాయుచ్చిన అంశములు తు. చ. తప్పక జరుగుచున్నవి. దేశము తెల్లవారి స్వాధీనమగునని "వానర మూతుల వారు భూమిని పరిపాలనము చేసేరు" అను వాక్యముచే గురుచంద్రుడు తెలిపినాడు. "వారి ప్రభుత్వము రెండువందల యేండ్లకు పైబడి ఉండు" నన్నాడు. "వీడు పోయేలోగా శమ స్తమైన అన్యాయాలు పుట్టు"నన్నాడు. "పమిడికంటి కుక్కలు రాత్రింబగళ్లు రాగాలు తీసేను" అని ఒకవాక్యము కాలజ్ఞానములో ఉన్నది. ఇది విద్యుద్దీపములనెడి కన్నులతో రేలు పవళ్ళు రాగాలు తీయు 'రేడియో' లను సూచించుటలేదా! ఇట్లనేక విషయములు రహస్యములుగను, సమర్మములుగను చెప్పబడినవి.

నేను చూచిన పెక్కుకాలజ్ఞాన గ్రంథముల వలె బ్రహ్మముగారి దని చెప్పబడు కాలజ్ఞానముగూడ పరిశుద్ధమైనదిగా లేదు కాలజ్ఞానపు ప్రతులను వ్రాసికొన్నవారు అందు వారి సొంతరచనమును కూడ కొంత చేర్చి యుందురు. చక్కగా వ్రాసికొనలేకపోయినందున గూడ అవి అపార్థములకు నెలవై యుండవచ్చును. పెక్కుప్రతులను సంపాదించి యథార్థమగు బ్రహ్మముగారి కాలజ్ఞానమును నిర్ణయించుటకై ప్రయత్నము చేయుట మంచిది.

భవిష్యద్విషయ పరిజ్ఞాన మనునది మనము పూర్వము చెప్పికొన్న సంయమముచే కలుగగలదు. సంయమేశ్వరులందఱును భూతభవిష్యద్వర్తమానము లనెడి మూడుకాలములయందలి విశేషములను తెలిసికొన సమర్థులై యుందురనుట నిక్కము. మన పురాణములు కొంతవఱకు భవిష్యదంశములను తెలుపుచున్నవి. అందును భవిష్యత్పురాణము ఆ అంశములను ఎక్కువగా చెప్పును. జ్యోతిశ్శాస్త్రముచేతగూడ భవిష్యత్తు నెఱుంగవచ్చును గదా! గురుదేవుడు పైమూడుశక్తులను పిడికిట బట్టిన మహనీయుడగుటచేత, లోకులు ఆశ్చర్యపడునట్లు కాలజ్ఞానమును చెప్పి వారికై మోడ్పులను అందుకొన జాలినాడు.

## ప ం చ మ స ం ఘో ద్ధ ర ణ ము

కక్కయ్య నామక మతిప్రవిమూఢ బుద్ధిమ్
భార్యాం విదార్య మణిపూరక ముఖ్యషట్కమ్
అన్వేషయ న్త మకరోత్-శ్వపచం కృతార్థం
యో వీరదేశకవిభు స్త మహం భజామి.

గురుదేవుని జీవితచర్యలలో మాదిగవాడగు కక్కయ్యకు సదుపదేశము చేసి, పంచమజాతి సముద్ధరణమునకు దారిచూపుట అనునది మిక్కిలి గొప్ప సంఘసంస్కార కార్యము బ్రహ్మముగారు కంది మల్లయపల్లెలో ఉన్న సమయములందు, తన యింటనే శిష్యులకు యోగ వేదాంత బోధలను చేయుచుండుట ఆయన నిత్యకృత్యము. ఈ బోధలు పరమ రహస్యములయినచో, సాధారణముగా జనులందఱు నిదురించిన పిమ్మట రాత్రివేళనే జరుగుచుండెడివి. ఒకనాటిరాత్రి గురుదేవుడు సిద్ధప్ప మున్నగు ప్రియశిష్యులకు షట్చక్ర రహస్యములను బోధించుచున్నాడు.

ఆధారము, స్వాధిష్ఠానము, మణిపూరము, అనాహతము, విశుద్ధము, ఆజ్ఞ—అనునవే షట్చక్రములు. ఈ ఆఱింటికి పైని సహస్రారకమలము ఉండును. షట్చక్రములను కమలములనికూడ పోల్చుచుందురు. ఆధార కమలమున నాలుగు దళములు, స్వాధిష్ఠానమున ఆఱుదళములు, మణి పూరకమున పది దళములు, అనాహతమున పదిరెండు దళములు, విశుద్ధమునందు పదునాఱు దళములు, ఆజ్ఞా చక్రమున రెండు దళములు ఉండునని శాస్త్రసంప్రదాయమును, మహాత్ముల అనుభవమును వాకొను చున్నవి. సహస్రారము వేయి ఱేకుల కమలమనియు, అందుముఖ్యమైనవి అష్టదళములనియు తెలియవలయును. (చూడు :— యోగదర్శనము) ఈ రెండు విధములగు సంఖ్యలకును ప్రత్యేకములగు రహస్యార్థము లున్నవి. వాటిని సద్గురువుల అనుగ్రహముచేత సాధకులు ఎఱుంగ వలయును. అకారము మొదలుగాగల ఏబది యక్షరములును విశుద్ధము మొదలుకొని ఆధారము వఱకు ఉన్న కమలముల దళములమీద నెలకొని యుండునని సంప్రదాయము. ఒక్కొక్క దళముమీదనున్న ఆ యా బీజాక్షరములను ఉపాసించుటచేత సాధకునకు సంసార నివృత్తి కలిగి మోక్షసంసిద్ధి యగును. జీవుడు ఆ యా చక్రములయందలి ఆ యా దళములమీద సంచారము చేయుచున్నప్పుడు వాటికిసంబంధించిన నానావిధ సంకల్పములు మంచివి, చెడ్డవి, మిశ్రమములైనవి కలుగుచుండును. ఆధారమునందున్న కుండలినీ శక్తిని మేలుకొల్పి సహస్రారమునకు సుషుమ్నామార్గమున పయనింప చేయుటకు మంత్ర యోగశాస్త్రములలో ఎంతయో సాధన ప్రణాళిక చెప్పబడియున్నది జీవుడు ఈ మార్గమున కుండలినీశక్తి తోడ్పాటుతో సహస్రారమున కేగి, అచ్చటనున్న పర మాత్మ తేజమును సందర్శింపజాలి దానితో ఐక్యమైనచో ముక్తుడగుననుట తత్త్వరహస్యము. ఈ ఆధారాది షట్చక్రములకు,సహస్రారమునకు సంబం ధించిన రహస్యములు పెక్కులు కీ. శే కోవెలవెన్ను పరబ్రహ్మ

తీర్థుల వారు తాము రచించిన "జగచ్ఛిల్పము" అను గ్రంథములో విస్తర ముగా వివరించియున్నారు. జిజ్ఞాసువులు ఆ గ్రంథమును చదివినచో అనేకాధ్యాత్మికరహస్యములను ఎఱుంగ వచ్చును.

ఇట్టి పరమరహస్యములను, వాటిని సాధించురీతులను గురుదేవుడు శిష్యులకు ఉపదేశించునాటిరాత్రి ఊరి తలవరిగా నుండి రాత్రివేళ గ్రామ సంచారము చేయుచున్న కక్కడు బ్రహ్మముగారి ఇంటి పంచలో పొంచి యుండి వినుట సంభవించినది. మూఢభక్తి ప్రేరితుడైన అతనికి అప్పటి కప్పుడే ఏదో తత్త్వము గోచరించినట్లు, పరబ్రహ్మము సాక్షాత్కరించి నట్లు తోచినది. అతడు వెంటనే ఇంటికి పోయి నిదురించుచున్న భార్య పొట్ట కోసి అందాధారాది చక్రములను చూచుటకు ప్రయత్నించెను. చక్రములు అగపడకపోగా, భార్య మరణించుటయనెడి దుష్ఫలము అతనికి కలిగినది. అతడు వెంటనే నెత్తి మోదుకొనుచు, ఏడ్చుచు గురు దేవుని యింటికి పరుగిడివచ్చి, తాను చేసిన ఘోరకార్యమును నివే దించెను. బ్రహ్మగురుడు అతని మూఢభక్తికి వింతపడి, సశిష్యుడై ఆ మాదిగవాని యింటికివచ్చి వానిభార్యను బ్రతికించినాడు. నాటినుండియు కక్కడు గురుదేవునికి ఎడబాయని ప్రియశిష్యుడై ఆయన బోధలచేత కృతార్థుడైనాడు. కేవల వేదాంత విద్యాదానముచేత కక్కని కృతార్థుని జేయుటేకాక, అంటరానివారుగా పాటింపబడుచున్న మాల మాదిగలను (అవర్ణులను) సంస్కరించి, సవర్ణులనుగా లెక్కింపజేయుటకును గురు దేవుడు ఎంతయో కృషి చేసినాడు. ఈవిధముగా నాలుగు వందల యేండ్ల నాడే హరిజనోద్ధరణ కార్యమునకు నాంది పలికిన గురుదేవుని దూరదృష్టి ఎంతటిదో భావింపుడు! తాను నాటిన ఈ సంస్కార బీజములు మూడు వందలయేండ్లకు పిమ్మట ఫలితావస్థకురాగలవని తెలిసికొన్న గురుదేవుడు మాలలు ప్రభుత్వ మొనర్తురు (మాలలకు మంచాలు బాపలకు పీటలు,

మాలవాడే రాజ్య మేలేనిమా) అని తన కాలజ్ఞానములోను, గోవింద వాక్యములలోను సూచించి యున్నాడు. అంతియే కాదు. కల్పితములైన ఈనాటి కులభేదములు ఎంతోకాలము నిలువవనికూడ గురుదేవుడు—

"అయిదువేల మీద బహుధాన్యలోపల
అన్నిజాతులు ఒక్కటయ్యేనిమా;
అవనిలోగల బీదధనవంతు లొకటిగా
అయ్యే యోగముగూడ వచ్చేనిమా.
హరి గోవింద, గోవింద॥"

అనెడి గోవింద వాక్యములలోస్పష్టముగా చెప్పియున్నాడు.

## అలౌకిక మహిమలు

ఆతఁడు తమోరజస్సుల కవల వెలుఁగు
సత్త్వమూర్తి త్రయీశిర స్స్వర రూపి
వెలుఁగులకు వెల్గు ప్రణవైక వేద్య నిత్య
తత్త్వ మా వీరగురుఁడు ప్రత్యక్ష మగుత.

గురుదేవుని అద్భుత చరిత్రమున ఎన్నదగిన యంశములలో లోకాతీత మహిమలను ప్రదర్శించుట ఒక ప్రముఖ ఘట్టమని చెప్పికొంటిమి. పాతంజలయోగ సూత్రముల ననుసరించి చూచిన, అణిమాది సిద్ధులను లోకాతీత మహిమలను ద్రోసిపుచ్చ వీలుకాదు "త్రయమేకత్ర సంయమః" అను సూత్రమునందు ధ్యాన ధారణా సమాధులనెడి మూడంగములను విజ్ఞాన భూమికమీద అనుసంధానము చేయుట సంయమమని చెప్పబడియున్నది. ఈసంయమమును ఆ యా విషయముల మీదికి కేంద్రీకరించి సంకల్పించినయెడల, యోగీశ్వరునికి ఆ యా సిద్ధులు చేకూరునని విభూతిపాదములో మహర్షి వివరించినారు. ఈ సంయమ

ప్రభావము వలననే సంయమికి అతీత వ్యస్త సమస్త శక్తులు కైవసములగును. పూర్వజన్మజ్ఞానము,భూత, భవిష్యద్విషయ పరిజ్ఞానము, పశు పక్ష్యాది రుత విజ్ఞానము, అణిమాదిసిద్ధులు, పంచభూత వశీకరణము, క్షుత్పిపాసల నడంచుకొనగల శక్తి, పరాభిప్రాయములను ఎఱుంగగల సామర్థ్యము, శాపానుగ్రహ దక్షత - మొదలగు మహాశక్తులు ఎన్నియో సంయమ వ్రతసాధ్యములు. దీనింబట్టి చూచిన మహిమలు అసత్యము లనజాలము దీనికి తోడు మహాపురుషుల జీవితములందు కనబడు మహిమలనుబట్టియు, వాటిని అసత్యములనుట సాహసమగుచున్నది.

రెండువేల సంవత్సరములనాడు క్రీస్తుప్రభువుకూడ అనేకములగు అలౌకిక మహిమలను ప్రదర్శించి, భక్తులను ఉద్ధరించినాడనియు, రోగుల రోగములను కుదిర్చినాడనియు బైబిలులో మనము చదివి యున్నాము. కన్నడ దేశమువారైన పెక్కురు శైవసిద్ధులను, తమిళ దేశము వారైన వైష్ణవ మహనీయులును, మహారాష్ట్రదేశమునకు చెందిన పెక్కురు మహాభక్తులును, తులసీదాస ప్రభృతులును ఎన్నెన్నో మహిమలను ప్రదర్శించినారని చదివియున్నాము. మన బసవపురాణాది గ్రంథములు మహిమల పుట్టలేగదా! అందు కొన్నింటిని త్రోసి రాజన్నను కొన్నింటిని కాదనుటకు వీలులేదు. ఇట్టి స్థితిలో కారణజన్ముడగు బ్రహ్మ యోగీంద్రుని విభూతిప్రదర్శనమును ఎట్లు పూర్వపక్షముచేయ జాలుదుము?

"ఐన్‌స్టీన్" మహాశయుడు మన గాంధీమహాత్ముని అహింసా ప్రయోగాది విధానములను, స్వాతంత్ర్య సంపాదనమునకు ఆయన అవలంబించిన సాధనప్రణాళికను, తదితర విశేషములను విని "ఇట్టి మహావ్యక్తి ఒకడున్నాడని ఒక శతాబ్దికి పిమ్మటనుండు జనులు విశ్వ సింపజాలరు" అని అన్నాడు. ఇట్టి స్థితిలో అనేక-అలౌకిక దివ్యమహిమ

లను జూపిన బ్రహ్మగురుని ఉదంతములను కొందఱు నమ్మజాలక పోవుట వింత కాదు. ఎవరు నమ్మినను, నమ్మకున్నను, ఒక్కొక్క మహాపురుషుడు తాను చేయవలసిన - చేయదలచిన కార్యములను చేయక ఊరకుండడు కదా !

మన గురుదేవుడు పోలేరమ్మ విగ్రహముచేత నిప్పు దెప్పించి నాడు. ఆదేవతను వశము చేసికొని, కొన్ని కార్యములను సాధించి ప్రజలకామెపై భక్తి నెలకొల్పెను. ఒక సందర్భమున మూసలో కరగు చున్న తగరమును పానీయముగా గటగట త్రావివైచెను. సిద్ధవటము నవాబు కొలువులో ఉపన్యసించినతటి, సశిష్యుడగు గురుదేవుని ఆ నవాబు తన ఆతిథ్యమును స్వీకరింపుడని కోరి, మాంససహిత భోజనము పెట్టి నాడట. ఆ పదార్థములు గురుదేవుని మహిమచేత పరిపక్వ ఫలములుగా మాఱిపోయెనట. ఈ అద్భుతమునకు నవాబు నివ్వెఱపడి స్వాముల వారిని క్షమింప ప్రార్థించినాడట. ఈ మహిమ నేత 'మాంసభోజనము కర్తవ్యము కాదుఅని' గురుస్వామి ప్రబోధించినట్లు గ్రహింపవలసి యున్నది. కర్నూలు నవాబు గురుదేవుని ప్రభావము నెఱుంగ గోరి, ఒక మాడి గుఱ్ఱము గర్భములోనున్న శిశువునుగూర్చి అది యెట్టి లక్షణ ములు గలదో సెలవిండని ప్రార్థించెను. గురుదేవుడు గుఱ్ఱపుపిల్ల లక్షణ ములను చెప్పినను నవాబు నమ్మక గుఱ్ఱమునుగోసి చూపవలసినదని కోరెను. బ్రహ్మముగారాతని కోరికప్రకారమే అశ్వగర్భమునుగోసి శిశువును వెలికిదీసి నవాబునకు చూపి, మఱల యథాపూర్వముగా దానిని అశ్వగర్భములో నుంచి, గుఱ్ఱమును బ్రతికించెనట. ఈ విధముగా గురు దేవుడు చచ్చినవారిని బ్రతికించినాడని చెప్పెడి కథలు పెక్కులు గలవు. సిద్ధప్పయు, ఈశ్వరమ్మయు ఇట్లే మృతులను బ్రతికించినట్లు కథ లున్నవి.

గురుదేవుడు అచ్చమాంబ గృహమున ఉన్నప్పుడు కేవలము ఆవుపాలనే ఆహారముగా తీసికొని శరీర యాత్ర చేసెను. వేంకటరెడ్డి గారి గోవులను గిఱిగీసి హద్దులోనుంచియు బలమును గోల్పోనీయక రక్షించెను. "శరీరమునందు షట్చక్రములుకలవా" అని మాదిగ కక్కడు తన పెండ్లమును గోసి చూచి హతాశుడై గురుదేవుని శరణు వేడగా అట్టి తఱి ఆతని అజ్ఞానమునకు వగచి వాని భార్యను మరల బ్రతికించి, కక్కనికి జ్ఞానోపదేశమొనర్చి ఉద్ధరించెనని చెప్పికొంటిమి. తాను సమాధిలో ప్రవేశించినపిమ్మటగూడ పెక్కురగు భక్తులకు శరీరముతో జాగ్రదవస్థలోనే అగపడి, వారి కడగండ్లను, సందియములను పాపెను. ఇంకను అత్రిమున్యాశ్రమమున ఉన్నప్పుడును, అచ్చమ్మగారి సేవలో కాలము పుచ్చునప్పుడును, గృహస్థజీవనము నెఱపునప్పుడును, అయ్యె తీర్థములందును. పుణ్యక్షేత్రములందును దిరుగు నప్పుడును, తనకు లోబడని ప్రతికక్షులను, మందబుద్ధులను ప్రబోధించు ఘట్టములందును గురుదేవుడు చూపిన స్వల్ప మహిమలును, మహా మహిమలును ఎన్నియో కలవు ఇట్టి మహిమలన్నియు మహా యోగీశ్వరుడగు గురుమూర్తియొక్క యోగప్రాభవముచేతను, సంయమ శక్తిచేతనే సాధ్యములైనవనుటలో ఆశ్చర్యము లేదు. కనుక మహిమలు అభూత కల్పనలనుట తగదు. అయిన, ఇట్టి మహిమలు యోగము సంపూర్ణముగా పండిన ఏ మహాపురుషుని విషయముననో తప్ప, అందఱి విషయమునను కలుగ నేరవని గ్రహింపవలయును. శతాధికములుగానున్న బ్రహ్మముగారి మహిమలలో కొన్నింటినిగూర్చి కీ. శే. పులికొండ వరబ్రహ్మకవిగారు "బ్రహ్మముగారి మహిమలు" అని ఒక పుస్తకమును వ్రాసియున్నారు.

ఈ సందర్భమున ఒక్క విషయమును పాఠకులు మఱువరాదు ఏ వ్యక్తిగాని కేవలముగా మహిమలను ప్రదర్శించినంతమాత్రమున

మోక్షార్హుడు కాజాలడు. మోక్షమునకు కావలసినది అనుభవ ప్రధానమగు బ్రహ్మజ్ఞానము, బ్రహ్మానుభవము, సదాచరణమును. యోగాభ్యాసాదుల చేతను, మంత్ర దేవతోపాసనలచేతను మహిమలు కలుగవచ్చును. అవి మోక్షహేతువులు మాత్రము కాజాలవు. గురుదేవుడు సైతము మహిమలను ప్రదర్శించుట ఆ యా కార్యములను సాధించు నిమిత్తమేకాని, అవి మోక్షహేతువులనిమాత్రము కాదు.

## స జీ వ స మా ధి

మన గురుదేవుడు ఈ విధముగా తన అవతారోద్దేశ్యములను నిర్వహించుచు, కుల మత విభేదములకు తన హృదయములో చోటీయక, ఏ మతమువానికేని, ఏ జాతివానికేని అర్హతయున్న వానికెల్ల బ్రహ్మ విద్యా దానము చేయుచు, నానా జాతులశిష్యులు తన్ను బలసి కొలుచు చుండగా యావద్భారతదేశ సంచారముచేసెను. ప్రయాణ సౌకర్యములు లేని ఆ కాలమున హిమాచలమునుండి ధనుష్కోటి వఱకుగల పుణ్య తీర్థములందు తిరుగుచు, ఆ యా తావుల జనులను తన దివ్య బోధామృతముచే తనుపుమా—కాలజ్ఞానమును, హిందూ మహమ్మదీయ సమైక్య సూత్రములను చాటుచు వేదాంత ప్రచారము ఒనర్చెను. ఈ ప్రచారములో ఆ మహానుభావుడు చూపిన మహిమలు, బోధసారము సాటిలేనివి. ఈ విధముగా జీవిత కార్యక్రమమును పూర్తిచేసి, ఒక వైశాఖశుద్ధ దశమీ భానువాసరమునాడు ప్రాణములతో నుండియే దివ్యసమాధిలో ప్రవేశించుటకు నిశ్చయించుకొనెను. బ్రహ్మగురుడు ఏ సంవత్సరములో సమాధినిష్ఠ వహించెనో తెలిసికొనుటకు ఇంకను సరియగు ఆధారములు దొరక లేదు. ఈ విషయమును గూర్చి గాఢ పరిశోధన జరుగవలసి యున్నది.

సిద్ధప్ప ఇప్పటికే గురుదేవుని సేవించి తత్త్వజ్ఞానమున పరిపక్వ దశ నందుకొనియే యున్నాడు అయినను గురుదేవుని చరమకాలము అమూల్యమైనది కావున ఆ సుసమయమునకూడ ఇంక ఎన్నో అమూల్య రహస్యములను తెలిసికొనవలయునని ఆతడు తహ తహ పడుచుండెను. కాని,పోతులూరయ్య సిద్ధుడన్నచో సహనములేక యున్నాడుగావున,సమాధి సమయమునకు వానిని గురువుల వద్ద లేకుండ చేయుటకు ఉపాయమును ఆలోచించుచుండెను. ఇంక కొందరు శిష్యులు గూడ పోతులూరయ్య దురాలోచనకు తోడ్పాటు నిచ్చిరి. వీరందరు కలసి సిద్ధునితో "సిద్ధా, గురుస్వాములు సమాధి కానున్నారు గదా ! సమాధి వేళకు పూలు, పత్రములు కావలసియుండును మనకు చగ్గరలో పూలు దొరకుట దుర్లభము. బనగానపల్లెలో మంచి పూలతోటయున్నదని నీవెరుంగుదువు. బనగానపల్లె దూరమయినను గుర్వనుగ్రహమును చూరలాడిన నీకు, అది దూరములో లెక్కకాదు. అచిరకాలములోనే పోయిరాగలవు కనుక శీఘ్రమే పయనమైపోయి పూలు, పత్రములు తీసికొని వేళ మీరకముందే రావలయును" అని ప్రోత్సహించిరి. గురుభక్తి తాత్పర్యము చేత సిద్ధుడు ముందు వెనుక లారయక వల్లెయని పూలకోసమై పోయెను పోతులూరయ్య మున్నగువారు సిద్ధుని పూలకై బనగానపల్లెకు పొమ్మన లేదనియు, చుట్టుప్రక్కల నెచ్చటకైనను పోయి పూలు తెమ్మన్నారనియు కొందరు వ్రాసియున్నారు ఎట్లయిన నగుగాక; సిద్ధప్పను సమయమునకు గురుదేవునివద్ద లేకుండ జేయుటయే వారి ప్రధానోద్దేశ్యమనుటమాత్రము సత్యము ఆ ఉద్దేశ్యము ఎచ్చటికి ఏ పనిమీద పంపినను నెరవేరునుగదా! పూల కేగిన సిద్ధునికి పూలు దొరకలేదు. నానా కష్టములకు లోనయి పూలు సంపాదించుకొని వచ్చునప్పటికి రావగిన వేళ మించియేపోయినది. గురుదేవుడు దివ్యసమాధిలో ప్రవేశింపనే ప్రవేశించినాడు.

తిరిగి వచ్చిన సిద్ధప్పకు పోతులూరయాదులు చేసిన మోసము తెలిసినది. ఆతడు పెల్లుగా దుఃఖించినాడు. గురుమహాదేవునిగూర్చి దీనాతిదీనుడై మొఱపెట్టుకొన్నాడు. ఎట్టకేలకు గురుని దయ ఆతనిపై ప్రసరించినది. గురుదేవుడు సమాధి మూతపలకలను తీయునట్లు సిద్ధునికి సంకల్పము గలిగించి, అట్లుజరిగిన పిదప దర్శనమిచ్చి మహాతత్త్వ రహస్యములను బోధించి నాడని కొందఱు రచయితలు వ్రాసియున్నారు. శ్రీ వడ్డెపాటి నిరంజనశాస్త్రిగారును, శ్రీ తత్త్వానంద స్వాములవారును తాము రచించిన 'బ్రహ్మానందలీల' నాటకములో బ్రహ్మము సమాధిలో నుండియే అంతర్వాణి మూలమున సిద్ధునికి మహావాక్య తత్త్వరహస్యము లను ఉపదేశించినాడని వ్రాసియున్నారు. ఇది యెట్లయినను జరుగవచ్చును. బ్రహ్మగురుడు సిద్ధప్పకు తన పాదుకలను, యోగదండమును, అంగుళీయ కమును ఒసంగియున్నాడు ఆ యోగదండాది చిహ్నములను నేటికిని మనము ముడుమాలలో నున్న సిద్ధప్పగారి మఠములో చూడగలము. ఇవి ఇచ్చుట యను కార్యము బ్రహ్మము సమాధినుండి బయటికి రాకున్న పొసగదు గదా ! కనుక గురుదేవుడు సిద్ధునికి మానసికముగా ఆజ్ఞ ఇచ్చి సమాధి మూతలాలను తీయించి, బయటికి వచ్చి మహోపదేశములను గావించి, చరమసందేశమును, యోగదండాదులను ఒసంగినాడను కొన్నను దోసము లేదు. లీలామానుష విగ్రహుండగు గురుదేవుని యెడ ఏదైనను సంభావ్యమే ! సిద్ధుని ఈవిధముగా ఉద్ధరించి కడకు ఆతనిని గృహస్థుని గమ్మనియే గురుడు ఆదేశించెను. గృహస్థాశ్రమమునకు పవిత్రతను సంపాదించుట ఆయన ముఖ్యోద్దేశ్యము కాన, అట్లు చెప్పు టలో వింత లేదు. ఈ అంశములు విస్తరముగా ఈ గ్రంథకర్త వ్రాసిన సిద్ధప్పగారి సంపూర్ణ చరిత్రలో వివరించినందున ఇచ్చట సంగ్రహముగా మాత్రమే వ్రాయుటయైనది. సిద్ధునికి గురుడొసంగిన చరమ సందే శమును గూడ పాఠకులు ఆ గ్రంథమునందే చూడవచ్చును.

గురుదేవుడు ఇట్లు దివ్యసమాధిలో తపోనిష్ఠయం దుండియు భక్త మండలికి అప్పుడప్పుడు దర్శన మిచ్చుచు తన మహిమలను చూపుచునే యుండెడి వాడట. ఇచ్చట స్మరింపవగిన అంశము ఒకటి అతిప్రధాన మైనది కలదు. బ్రహ్మముగారు సమాధిస్థులైన పిమ్మట కూడ వారి భార్య యగు గోవిందమ్మగారు మాంగల్య చిహ్నములను పరిహరింపలేదు. అందుకు కారణము గురుచంద్రుడు మరణము నొందకయే జీవములతో సమాధినిష్ఠులగుటయే। ఇట్లుండ సమాధియైన సంవత్సరమునకు వార్షికా రాధనము చేయదలచి, పోతులూరయ్యయు, మఱికొందఱు శిష్యులును పరిసరగ్రామములకు చందాకై పోయిరి. అప్పుడు ఆగ్రామములలోని అన్ని వర్ణములవారును చందానిచ్చి సత్కరించిరిగాని, కొందఱు విశ్వబ్రాహ్మ ణులు మాత్రము "మీతండ్రి మరణించినను, మీతల్లి మంగళ సూత్రాదు లను తీసివేయలేదు ఇది కులాచార ధర్మములకు విరుద్ధముకాదా ? కావున మేము మిమ్ము వెలిపెట్టితిమి." అని యెదురు తిరిగిరి. అందుకు పోతు లూరయ్య ఆగ్రహోదగ్రుడై చేయునదిలేక, మాతృదేవి వద్దకువచ్చి, జరిగినదానిని విన్నవించి మంగళసూత్రాదులను తీయవలసినదని ఆమెను నిర్బంధించెను. గోవిందమ్మ విశ్వబ్రాహ్మణుల అజ్ఞానమునకును, కుమా రుని మూర్ఖత్వమునకును మిక్కిలి చింతించి, పోతులూరయ్య కిట్లు సమాధానము చెప్పెను. "నాయనా ! పూజ్య పాదులగు గురుదేవులు మరణింపలేదు. వారు సమాధిలో తపోనిష్ఠులై యున్నారు. సందేహింప వలదు. శ్రీవారు మరణించినగదా నేను మంగళసూత్రాదులను పరిహ రింప వలసినది? లోకులు అజ్ఞానులై యాడిన పలుకులకు నీవిట్లు తామసింపవచ్చునా?." లోకదృష్టియే గాఢముగా నున్న పోతులూరయ్యకు తల్లిమాట నచ్చలేదు తన సందేహము తీఱుటకై అతడు సమాధిపైనున్న మూత పలకలనుతీసి చూడనే చూచినాడు. ఆసమాధిలో గురుదేవునిదేహము చెక్కు చెమర్పక యున్నది. ఆ మహానుభావుడు చిన్ముద్ర ధరించి

రెండవ దక్షిణామూర్తివలె ప్రకాశించుచుండెను. అట్లున్నను పోతులూరయ్య గురుదేవుడు బ్రతికియున్నాడని నమ్మలేక, ఆయనను పలుకరించి సమాధానము పడయ జాలక పోయెను. చిట్టచివరకు ఆతడు అమ్మహాతపస్వియొక్క గడ్డము పట్టుకొని యూచెను. అంతట స్మృతి కలిగిన గురుదేవుడు కనులు తెఱచి చూచి, సంగతిని గ్రహించి "పోతులూరా ! ఈ మహాపాపము శమించువఱకు పదిరెండేండ్లు ఆకులు అలములు తినుచు, అరణ్యవాసము చేయుచు తపము సలుపవలసిన" దని నిష్కృతిని ఆదేశించి మఱల సమాధినిష్ఠు డాయెను. చూచితిరా ! దేశికేంద్రుని మహామహిమము ! తనవాడు పెఱవాడు అను భేదములేక కర్మమునకు తగినట్లు శాపానుగ్రహములకు గుఱిచేయు సత్యనిష్ఠ బ్రహ్మగురుదేవునకే చెల్లె !

## ఉపసంహారము

వీరబ్రహ్మేంద్రస్వామి ఈ విధముగా లోకోత్తర మహిమలను చూపియు, యోగసమాధి సంపదను వెలయించియు, సంఘసంస్కారము చేసియు, భాషావిషయమున ఎనలేని సేవ ఒనర్చియు, కుల మత ద్వేషములను దూరముచేసి విశ్వమానవ సౌభ్రాత్రమును స్థాపించియు, అఖండ వేదాన్త జ్ఞానసారమును చిలికియు, ఆంధ్రప్రజా మండలమునకేగాక, అఖిల మానవ సమాజమునకును కల్యాణకర మార్గము నేర్పఱిచి ప్రకాశించెను.

మన గురుదేవుడు ఒక గొప్ప సంస్కర్త. కావుననే అచ్చెమ్మకును. వేంకటరెడ్డికిని, మహమ్మదీయుడగు సిద్దప్పకును, మాదిగవాడగు కక్కయ్యకును మంత్రోపదేశము, మహావాక్యోపదేశము చేసి, అర్హతగల

వారికి బ్రహ్మవిద్యాధికార మున్నదని చాటెను. బ్రాహ్మణాది వర్ణములు సత్వ రజ స్తమోగుణముల న్యూనతాధిక్యములను బట్టి ఏర్పడునని గురు దేవుని అభిప్రాయము. "చాతుర్వర్ణ్యం మయా సృష్టమ్ గుణ కర్మ విభాగశః" అన్న గీతాకారుని అభిప్రాయము కూడ ఇదియే. ఈ అంశ మును శ్రీ శంకరులు గీతాభాష్యమున వివరించి యున్నారు. అంతియే గాని, బ్రాహ్మణునికి పుట్టినవాడెల్ల బ్రాహ్మణుడనియు, శూద్రపుత్రుడు శూద్రుడేయనియు నేడు అనుసరింపబడుచున్న వ్యవస్థ యుక్తమైనది కాదనియే బ్రహ్మగురుని ఉద్దేశ్యము. అందుకనియే ఆయన అవర్ణసవర్ణ లను, అన్యమతస్థులనుకూడ శిష్యులనుగా పరిగ్రహించి సముద్ధరించినాడు. గాంధిమహాత్మునిచే విస్తరింప జేయబడవలసియున్న హరిజనోద్యమము నకు బ్రహ్మగురుడు బీజావాప మొనర్చినాడు. తాను రజస్వలయైన కన్యనే పెండ్లియాడి తద్వివాహముల ఆవశ్యకతను ఆచరణముగా నిరూపించెను. తన మనుమరాలు ఈశ్వరీదేవి అవివాహితయై ఉండుటకు అంగీకరించి, సమర్థురాండ్రగువనితలు సంఘమును సేవించు నిమిత్తముగాని, ఒక మహోన్నత లక్ష్యమును సాధించుటకు గాని యావజ్జీవము బ్రహ్మచారి ణులుగానే ఉండవచ్చునని ప్రబోధించినాడు. ఇది సర్వ స్త్రీజన సాధారణ మగు విషయము మాత్రము కాదు. అధిక సంఖ్యాకులలో ఏ ఒక రిద్దరో మాత్రమే అట్లు ఉండజాలుదురనియు, అట్టివారిని సంఘము ఆక్షేపింపరాదనియు మాత్రమే మనము గ్రహింపవలసి యున్నది.

ఆ మహనీయుడు ఒక సర్వమత సమన్వయమూర్తి. కావుననే పరమతస్థుడగు మహమ్మదీయబాలుని ప్రధానశిష్యునిగా చేపట్టి తనయంత వానిని చేసెను. నవాబుల ఆస్థానములందు భేదవాద నిర్వాపణ మొనర్చి నానా మతములలోని ప్రధాన మూలసూత్రములను సమన్వయపరచి, ఏ మతమైనను మానవులకు ఈశ్వరసాక్షాత్కార యోగ్యత కూర్చి,

ఆత్మశాంతిని నెలకొల్పుటకే ఏర్పడినదనియు, ఉత్తమ తత్త్వసిద్ధి నందినవారు సర్వమతాతీతులై ప్రకాశింతురనియు ప్రబోధించి, మతదురభిమానమును నాశమొందించి, సర్వమతస్థులు అన్నదమ్ములవలె మెలంగుటకు సఖ్యనిదానము నేర్పఱచి, హిందూమహమ్మదీయైక్యమునకు బీజములను నాటెను. ఈ బీజములే పిమ్మట రాజారామమోహనరాయలవారిచేతను, గాంధిమహాత్మునిచేతను అంకురింపజేయబడి నేటికి సత్ఫలములను ఇచ్చుచున్నవి.

ఆ కవిచంద్రుడు ఒక మేటి భాషోద్ధారకుడు. వ్యావహారిక భాషలో ఉత్తమ సంస్కార ప్రబోధకములగు సత్యసూత్రములను ప్రచారము చేసెను. ఆ మహాత్ముడు గురువులకు గూడ గురుదేవుడగు ఒక జగద్గురుడు. కావుననే పెక్కురు వేదాంతాచార్యులు ఆ గురుమహారాజు ననుగ్రహము వలన తమ నడవళ్లను దిద్దుకొని లోకసంగ్రహ కార్యములందు అప్రమత్తులై విశ్వజనీనము లగు ఉపనిషత్సిద్ధాంతములను ప్రచారము చేసినారు. పుష్పగిరిలోని శంకరపీఠము ఇమ్మహాత్ముని దివ్య ప్రబోధముచేతనే తెలివొంది, తొంటి జవసత్వములను పొంది ప్రకాశించినది కదా!

ఆ సంయమి త్రికాలజ్ఞుడగు మహా పురుషుడు. తన సహజజ్ఞానమునకు జ్యోతిశ్శాస్త్రమును కూడ తోడుచేసికొని ముందు జరుగబోవు అద్భుత సత్యములను తేటతెనుగున ప్రవచించి "కాలజ్ఞానము"ను చాటి చెప్పెను. ఆ శిల్పాచార్యుడు ఒక ఉత్తమ పౌరుడు. తానొక అవతార పురుషుడయ్యును, సామాన్య జనునివలె ప్రజాసమూహములో కలసి, అందును కర్షకులకును, కర్మకారులకును ప్రియబంధువై, వారి ఉద్యమములకు చేయూత నిచ్చుచు గ్రామపరిశ్రమలును, సస్య సంపదయు

పెంపొందుటకు సేవచేసి ఉత్తమ పౌరధర్మముల ప్రచారము చేసెను. అచ్చమ్మగారి యింట ఆలకాపరి యుద్యోగముచేసి దేశమునకు పశు సంపత్తియు, గోపూజాపరతయు అత్యవసరములని నిరూపించెను

ఆతడు ఒక ఆదర్శ గృహస్థుడు రామచంద్రునిలోనున్న సదాచరణము, కృష్ణజీవితములోనున్న ఉపదేశకత్వవిశిష్టమగు శాస్త్రప్రవచనము- ఈ రెండును ఈయనలో రూపెత్తినవి. గృహస్థుడుగాఉండియు తామరాకు మీది నీటిబొట్టువలె సంచరించుచు, మోక్షపురుషార్థమును సాధింపవచ్చునని బ్రహ్మగురుడు ఆచరణ పూర్వకముగా నిరూపించెను తనతోపాటు తన కుటుంబమును, పరివరస్థులనుగూడ మోక్షార్హులనుజేయు క్రమశిక్షణము నిచ్చిన మేటి యొజ్జ ఈ గృహపతి. మేలుబంతులగు పత్నీ పుత్ర శిష్య బంధు పరివారములతో గూడిన గురుని గృహము భూలోక స్వర్గ ధామమై యొప్పినది.

ఇక గురుదేవుడు మహావేదాంతి యనియు, యోగీశ్వరుడనియు, సంయమి యనియు, జ్ఞానిసత్తముడనియు చెప్పుట పునరుక్తియే అగును. అతిలోకములగు ఈ గుణములను లౌకిక కార్యములందు సమన్వయ పఱచి, వేదాంతము కేవలము అరణ్యవాస సాధ్యము మాత్రమే కాదనియు, సామాన్య ప్రజాజీవనమునను, సాంఘికసమస్యా పరిష్కారమునను వేదాంతసూత్రములు ఆచరణయోగ్యము లయినపుడే-మనలో- హింస, ద్వేషము, క్రౌర్యము మొదలగు రాజసగుణములను బోకార్చి, ధర్మదయా స్నేహాది దైవగుణములతో సమాజమును కల్యాణవంతమొనర్చి శాంతి సౌఖ్యముల దేలియాడ జేయునని స్వయముగా ఆచరించి చూపిన మహా ప్రభావుడు ఈ జగద్గురుడు కావుననే గురుచంద్రుని విషయమున ఒక్క జ్ఞానమేకాదు, కర్మమే కాదు, యోగమే కాదు, భక్తియే కాదు, నాల్గు

మార్గములను కలసికొన్నవి. ఏ యోగమునకైనను గురునిహృదయములో స్థాన మున్నది. ఈ బ్రహ్మమూర్తిలో రామ, కృష్ణ,బుద్ధ, శంకర, రామానుజ, మధ్వాదుల బోధల సారమే కాదు - జీసను, మహమ్మదు మున్నగు ప్రవక్తల భావవాహినులును సంగమించినవి. విశాలమగు ఉపనిషన్మత గర్భములో సర్వమత సిద్ధాంతములకును స్థాన మున్నట్లు, ఈ విశ్వమతప్రతినిధి హృదయములో అన్ని మతసూత్రములకును, సర్వ మహాపురుషుల సదుపదేశములకును తావున్నది. ఎందును కనని వినని సమన్వయశక్తి ఈ వ్యక్తిలోనెలవు చేసికొనుటంబట్టియే, ఎట్టి విరుద్ధశక్తుల నేని గురుమహారాజు కైవసము చేసికొని, సుస్థిరశాంతిని చాటగల్గినాడు. వైవిధ్యసంశ్లిష్టమగు ఆర్షమహిమకున్న ప్రత్యేకత ఇదియే కదా! తమ ఆశ్రమవాటికలలో మనుష్యేతరములగు ఘాతుక మృగములనుగూడ సాధుభావ సమన్వితముల నొనర్చి, వాటిసేవలను గైకొన్న ఋషుల మహాశక్తి మానవాభిప్రాయములను మార్చ జాలదా! సూక్ష్మదృష్టితో అవలోకించినచో గురుబ్రహ్మమునందు ఈ ఆర్షశక్తి సముజ్జృంభణమునే మనము కాంచగలము.

గురుదేవుని అచంచలమగు ధర్మదీక్షలో శైవ, వైష్ణవ, శాక్తేయాది వైదిక మతశాఖలు సముచితవికాసము నంది మానవతారకములై ఒప్పినవి. నామ రూప భేదమాత్రముచే వేఱు వేఱుగా నున్న ఆ యా మతముల ఆంతరిక తత్త్వము ను భేదములేని సమరసస్వరూపముగా సమన్వయించి గురుమూర్తి వైదికసిద్ధాంతములను సమ్మానించెను. సువిశాలమగు ఆ గురుదేని మతదృష్టి అడ్డమాకలు లేక, సంకుచితము కాక, విశ్వజనీన సంస్కారసారమును జాల్వార్చి, విశ్వశాంతిజ్యోత్స్నను వెలయించి మించెను. ఈ నాడు ఆంధ్రదేశము చేయవలసినంత ప్రచారమే చేసినచో గురుమహాదేవుని అవతార కల్పలత విశ్వమానవ జగత్తునకు కావలసిన మధుర ఫలములను పంచిపెట్టగలదు.

నేటి యుగపురుషుడు, ప్రపంచశాంతిదూత, పురుషోత్తముడునగు గాంధిదేవు డిచ్చిన అమరసందేశములోని సత్యాహింసలు, విశ్వజీవ కారుణ్యము, మతసహనము, హిందూ మహమ్మదీయైక్యప్రబోధము, అస్పృశ్యతా నివారణయత్నము, వృత్తివిద్యాప్రచారము, జగద్భక్తి, స్వాతంత్ర్యదీక్ష—మున్నగు మహాప్రబోధములు వీరబ్రహ్మేంద్రస్వాములు ఆచరించి, ప్రబోధించి అవసరములని చాటినవే అని గ్రహించుట సులభము. వీరదేశికుడు సంకల్పించి, ఆరంభించిన మహోద్యమము ప్రపంచమందు అంతటను ప్రచారము నందినయెడల విశ్వమానవ కల్యాణము చేకూరి, లోకమున సౌఖ్యానందశాంతులు తేజరిల్లగలవనుట సత్యము. మన గురుమహాదేవుని తపస్సు పండి, ఆయన సంకల్పములు సఫలములై అచిరకాలములోనే సమాజము ఈ సమున్నతాదర్శములను ఆచరించి కృతార్థము కావలయునని ఆశింతము.

ఓం సర్వేషాం స్వస్తి భవతు. సర్వేషాం పూర్ణం భవతు.
సర్వేషాం శాంతి ర్భవతు.

—o—

# అనుబంధము

## బ్రహ్మముగారి కాలము

నేను 1949 ప్రాంతమున వీరబ్రహ్మముగారి చరిత్రాంశములను పరిశోధన చేయుటకు పూనుకొని కొంతవరకు కృషి చేసియుంటిని.

తత్ఫలితముగా వీరబ్రహ్మస్వామి క్రీ. శ, 1604 మొదలుకొని 1690 ప్రాంతము వఱకు నుండి తన లీలలను మహిమలను ప్రదర్శించినట్లు కొన్ని ఆధారములను సంపాదింపజాలినాడను. కాగా 17 వ శతాబ్ది పూర్తిగా ఈ మహనీయుని చరిత్రోదంతములతో నిండియున్నట్లు తోచు చున్నది.

బ్రహ్మముగారు నేటికి సుమారు మూడువందల యేండ్లకు పూర్వ మున్నారని ఆయన శిష్యులును భక్తులును చెప్పుచుందురు. కందిమల్లయ పల్లెలోని బ్రహ్మముగారి మఠము పరిపాలకులును ఇట్లే చెప్పుచుందురు. మఠములో బ్రహ్మముగారి సమాధితోపాటు తద్వంశీయుల సమాధులును పెక్కులున్నవి. ఒక్క సమాధిమీదగూడ సమాధి చెందినవారి సమాధి కాలము శాసనరూపముగా చెక్కబడిలేదు. అట్టి శాసనములే ఆసమాధుల మీదనున్నచో కాలనిర్ణయమునకు మనము పరిశోధన చేయవలసిన యక్కఱయే యేర్పడెడిది కాదు. భక్తాదులు చెప్పు పుక్కిటిపురాణము లను బట్టియే మనము కాలనిర్ణము చేయరాదు కదా! కావున బాహిర ములును, ఆంతరములునగు కొన్నిదృష్టాంతములు దొరకిననేగాని సరి యగు కాలమును నిర్ణయించుటకు వీలుకాదు. ఇందుకు నాకు దొరకిన యాధారభూత గ్రంథము లివి:-

1. 1920 ప్రాంతమున శిల్పసాగరబిరుదాంకితులు శ్రీ తాటికొండ వెంకటరాఘవాచార్యులుగారు వ్రాసి ప్రకటించిన "వీరాచార్య చరిత్రము".

2 1937 లో కందిమల్లయ్యపల్లె నివాసియగు శ్రీ చాటుకొండ సుబ్బయ్యగారు రచించి ప్రకటించిన "శ్రీ వీరబ్రహ్మముగారి జీవిత చరిత్రము".

3, "కాలజ్ఞాన తత్త్వములు" అను పుస్తకము.

4. కాగితములమీద వ్రాయబడిన 'కాలజ్ఞానము' అను గ్రంథము.

5. కవిశేఖర వడ్డెపాటి నిరంజనశాస్త్రిగారు రచించిన 'కళ్యాంధ కౌముది" అను పద్య కావ్యము.

మద్రాసు ప్రాచ్యలిఖిత గ్రంథాలయములో మెకంజీదొరగారు సంపాదించిపెట్టిన గ్రామచరిత్రలు (కైఫీయతులు) కొన్ని చూచితినిగాని, వానియందు వలసిన యంశములు దొరకలేదు. ఇంకను గాఢముగా పరిశీలించినచో ఏమేని ఆధారములు దొరకునేమో !

మఠములోనున్న ఒక కాలజ్ఞానగ్రంథములో బ్రహ్మముగారి పౌత్రియగు ఈశ్వరమ్మగారు సమాధిస్థైన కాలము కలియుగాబ్దములు 4871 కి సరియైన వికృతి సంవత్సర చైత్రశుక్ల విదియ సోమవారమని వ్రాయబడియున్నది నేటికి కలిగతాబ్దములు 5060 కాగా ఈశ్వరమ్మ గారు సమాధిఅయి నేటికి 189 సంవత్సరములు. ఈశ్వరమ్మగారు 95 సంవత్సరముల పూర్ణజీవితమును గడపి తత్త్వవిద్యా ప్రచారము చేసినదని ప్రసిద్ధి యున్నది. ఆమె మహాయోగినియు, బ్రహ్మచారిణియు గావున 95 సంవత్సరముల పూర్ణజీవితమును గడపినదను ప్రసిద్ధి అయథార్థము గాదు. అప్పుడామె జననకాలము కలియుగ సం॥ 4776 అగుచున్నది. బ్రహ్మముగారు జీవసమాధిని ప్రవేశించునప్పటికి ఈశ్వరమ్మ గారు 10, 12 సంవత్సరముల వయస్సుగలవారట. ఆ పది రెండు సంవత్సరములు కలుపుకొన్నచో 4788 ప్రాంతము బ్రహ్మముగారి సమాధికాల మగుచున్నది. కాగా నేటికి 272 సంవత్సరములనాడు బ్రహ్మము సమాధిస్థైనారని తేలుచున్నది. తరమునకు ముప్పది సంవత్స రములని లెక్కచూచినచో నేటికి తొమ్మిదితరములనాడు బ్రహ్మముగా రున్నారని చెప్పుటకు వీలగుచున్నది. దీనికి తగినట్లు బ్రహ్మముగారి

నుండి నేటివఱకు వారివంశపరంపరలోనివారిసమాధులుతొమ్మిది బ్రహ్మము గారి మఠములో నేటి కగపడుచున్నవి. కనుక క్రీ. శ 1687 ప్రాంతము సమాధికాలము. కాగా అంతకు పూర్వకాలమున బ్రహ్మముగారు జీవించి యున్నారన్నమాట. ఆయనకు ఎనుబదియేండ్లకు మించిన జీవిత కాలమును ఊహ సేయుచో పదాఱవ శతాబ్ది ప్రారంభ మాయన జననకాలమగును. బ్రహ్మముగా రెనుబది వత్సరముల కెక్కువయే జీవించినా రనుటకు అనేక సాక్ష్యము లున్నవి:

ఇంకొక ప్రమాణమును బట్టి చూతము. ముద్రితములగు కాల జ్ఞాన తత్త్వములలోని ఒక మంజరీ ద్విపదలో నిట్లున్నది.

"ఆనంద గురువుల అనుమతిచేత
భావసంధికివచ్చి భక్తవత్సలుడు
ఆదికేశవులకు అభయంబు నిచ్చి
ఆదిలక్ష్మినిగూడి ఆనందమొంది
సిద్ధార్థినామ సంవత్సరమందు
బనగానపల్లెలో పరగంగ నిలిచి
రత్నసింహాసనారూఢుడై తాను
కృతయుగ ధర్మంబు నడిపించుకొఱకు
వీరవసంతుడై వచ్చియున్నాడు
కానకయున్నాము బ్రహ్మంబు మాయ
కారణంబులు ముందు కానవచ్చెడును."

దీనిని బట్టి సిద్ధార్థినామ సంవత్సరములో బ్రహ్మము బనగాన పల్లెలో విహరించినట్లు తెలియుచున్నది. బనగానపల్లెలో వీరప్పయ్య యను పేర బ్రహ్మముగారు గరిమిరెడ్డి అచ్చమ్మగారి యింట ఆవుల

గాయుట, అన్నాజయ్య మొదలగు శిష్యులకు కాలజ్ఞానాదు ఉపదేశించుట చరిత్రప్రసిద్ధము. నేటికిని బనగానపల్లెలో బ్రహ్మము విహరించిన ఆయా చిహ్నము లగపడుచుండుట, భక్తులు వెళ్ళి చూచుచుండుట ప్రత్యక్షము. పై ద్విపదగేయమును బ్రహ్మముగారి ప్రియశిష్యులగు అన్నాజయ్యయో, మఱి ఇంకెవ్వరో వ్రాసియుందురని తలంపవచ్చును.

ఇప్పటి వికారి వత్సరముతో ఆఱువికారులను దీసి వేయగా అయి దుఱువదులు మూడు వంద లగుచున్నవి. తుది వికారినుండి విలోమముగా (వెనుకకు) లెక్కించినచో సిద్ధార్థినాటికి నలుబది సంవత్సరము లగును. కాగా ఇప్పటికి 340 సంవత్సరములనాడు వీరబ్రహ్మముగారు బనగాన పల్లెలో నున్నారని చెప్ప వీలగుచున్నది. పై ద్విపదలోని "భావసంధి" "వీరవసంతాది" పదములు గూఢార్థయుక్తములు. వసంతము లోకమునకు వికాసకారి గావున మానవ వికాసమునుగూర్చి తనను వీరవసంతుడని ఆయన చెప్పుకొనుటగాని, శిష్యులు అలట్లనుటగాని జరిగియుండవచ్చును. బ్రహ్మము విష్ణుదేవు నవతారమనియు, ఆయన భార్య గోవిందమ్మ ఆదిలక్ష్మి అనియు కాలజ్ఞానాది గ్రంథములలో ఉపవర్ణితము. ఆ యంశ ములు పై ద్విపదలోను సూచితములైనవి.

గరిమిరెడ్డి అచ్చమ్మగారి యావుల గాచునప్పటి కాయనకు 12, లేక 15 వత్సరముల కెక్కువయుండవు. దీనింబట్టి చూచినచో నేటికి 355 ఏండ్లనాడు—క్రీ.శ. 1604 ప్రాంతమున బ్రహ్మముగారు జన్మించి యుండవచ్చునని తెలియుచున్నది. 1687 ప్రాంతమున జీవసమాధియందు ప్రవే శించినారని పూర్వము చెప్పికొంటిమి గాన, 17 వ శతాబ్దియందంతయు ఆ మహనీయుని జీవితలీలలతో గడచినట్లు భావింపవచ్చును.

ఇప్పటి కలియుగాది గతాబ్దసంఖ్య 5060 లో 355 తీసివేయగా కల్యాది 4705 బ్రహ్మముగారి జననకాలమగుచున్నది. కాలజ్ఞానములోని వర్ణనమును బట్టి చూచినను పై లెక్క సరిపడుచున్నది. కాలజ్ఞానము లోని వర్ణనలు —వాక్యములు పెక్కులు శ్రీ కృష్ణ దేవ రా య ల యనంతరము జరిగిన వృత్తాంతములను సూచించు చున్నవి. కృష్ణ రాయల పిమ్మటనే—అందును తల్లికోటయుద్ధమునకు పిమ్మటనే విజయ నగర ప్రాంతము మహమ్మదీయాక్రాంత మగుటయు, భారతధర్మము దెబ్బదినుటయు సంభవించినది గావునను, హిందూమహమ్మదీయ విభేద విద్వేషములు పొడచూపినవి గావునను తత్సంస్కరణమునకే తా నవ తరించి కృషి చేయుచున్నట్లు కాలజ్ఞానములో బ్రహ్మము విస్పష్టముగా పేర్కొనినాడు.

"కలియుగము సుమారు 3180 సం॥ (సరిగా 3172 సం॥) జరుగగా శకపురుషుడగు శాలివాహను డవతరించి ధర్మపరిపాలనము చేసెను. శాలివాహన శక సం॥ 1258 గడవగా ఆనెగొందియను రాయసింహాసనమునకు హరి హర రాయలు రాజై ధర్మపరిపాలన మొనర్చుచు విజయనగరమను నొక పట్టణమును నిర్మించుకొని యదియే రాజస్థానముగా ప్రజాపరిపాలనము చేసెను. వారి తరువాత వారి సంతతి వారు మూడుతరములవారు పాలించిరి. (?) అటు పిదప సాళువనర సింగరాయలు 13 ఏండ్లేలెను. అతని కుమారుడు వీరనరసింహరాయలు తమ్మురాయలను జంపించి అయిదువత్సరము లేలెను. నరసరాయని రెండవకుమారుడగు కృష్ణదేవరాయలు 21 వత్సరములు పాలించెను. అచ్యుతరాయలు ఎనిమిది నెలలు రాజ్య మేలెను. సదాశివరాయలను ముందుంచుకొని రామరాజు 22 సం॥ విజయనగర పాలనము చేసెను. అతనితో విజయనగర హిందూసామ్రాజ్య మంతరించెను. (తరువాత

తురకల పరిపాలనలోని దుశ్చర్యల వర్ణనమున్నది. అది యిట ప్రస్తావింపనైతిని ) అప్పటికి కలియుగము 4700 సంవత్సరములు గడచెను."

ఇది కాలజ్ఞానములోని భాగము. తరువాత భూదేవి పాప భారమును మోయలేక విష్ణుమూర్తితో మొఱపెట్టుకొన్నట్లును, ఆమె మొఱ నాలకించి యాతడు బ్రహ్మముగాను, శంకరు డానందభైరవ యోగిగాను, బ్రహ్మదేవుడు అన్నాజయ్యగాను భూలోకమున బుట్టి నట్లును కాలజ్ఞానము చెప్పుచున్నది.

ఇంకను బ్రహ్మముగారు బనగానపల్లెలో అన్నాజయ్యకు కాలజ్ఞానము నుపదేశించుచు, విజయనగర రాజులవృత్తాంతమును వినిపించిన పిమ్మట ఇట్లు నుడివిరి :

"రామరాజుతో విజయనగరసామ్రాజ్య మంతరించెను. తరువాత నా రాష్ట్రమునకు మహమ్మదీయులు ప్రభువులై ధర్మముల తిరస్కరింపుచు న్యాయ మెఱుగక రాజ్యపాలనము చేయుచుండిరి ఇట్ల ధర్మములు దేశమున పెచ్చు పెరుగుటచేత వాని నణచుటకై నేనిట్టి యవతార మెత్తితిని. నాయనా! నాకీయవతారమందు వీరబ్రహ్మము సాధారణ నామధేయము. బాల్యమున వీరంభట్లయ్యయనియు, నిపుడు వీరప్పయ్య యనియు, నిక ముందు వీరబ్రహ్మమనియు నామాంతరములు గలవు. ఈ నామధేయములతో కొందఱికి విజ్ఞానము గఱపి సమాధి నిష్ఠ వహింతును" అనియు, మఱియొకచో" .... పిమ్మట అనంతావతార మహిమలకుగాను పదునొకండవ యవతారమెత్తి బనగానపల్లెలో పంచవింశద్వర్షములు తపముచేసి వెనుక కొంతకాలము గృహస్థాశ్రమమున నుండి యనేక శిష్యకోటికి జ్ఞానోపదేశముచేసి యటు వెనుక సమాధినిష్ఠ వహింతును" అని యున్నది.

దీనినిబట్టి బ్రహ్మము మహమ్మదీయుల దుశ్చేష్టల నరికట్టి వారికి మతసామరస్యమును బోధించుటకును, హిందూజాతిని సంస్కరించుటకును బూనినట్లు తెలియుచున్నది. ఇంకను ఇదిపదునొకండవ యవతారమనియును దెలియుచున్నది. ఇందలి అతిలోకములు-దేవతాత్మకములు నగు వర్ణనలను ఎల్లరును విశ్వసింపజాలక పోయినప్పటికిని, చారిత్రకాంశములను గుర్తించి వానికి ప్రాధాన్యమిచ్చి, తత్త్వమును విచారించుటకు వెనుకంజ వేయరని తలంపవచ్చును.

పై నుదాహరించిన కాలజ్ఞాన వాక్యములనుబట్టిచూడ బ్రహ్మముగారు బనగానపల్లెలోనుండి తపస్సుచేసినది ఇరువదియైదేండ్లని తెలియుచున్నది. అతడు పన్రెండవయేటగాని, పదునేడవ యేటగాని బనగానపల్లెకు వచ్చినాడనుకొన్న, దాదాపు నలుబది వత్సరముల ప్రాయమున ఆయనకు వివాహము జరిగినట్లు నిశ్చయింపవచ్చును. బనగాన పల్లెనుండి కందిమల్లయపల్లెకు వచ్చిన పిమ్మటనే ఆయనకు వివాహము జరిగెను. వెంటనే ప్రథమసంతానముగా గోవిందయ్య జన్మించినాడు. ఆయన కుమారికయే ఈశ్వరమ్మగారు. బ్రహ్మముగారి జననము క్రీ. శ. 1604. ఆయనకు నలుబదవయేట వివాహము జరిగినదనుకొన్నచో 1644 పెండ్లి కాల మగును. వివాహానంతర మొకటి రెండు సంవత్సరములలోనే గోవిందయ్యగారు జన్మించినారన్న 1645, 46 గోవిందయ్య జన్మకాలము కాగలదు. ఆయనకు 30 యేండ్ల ప్రాయమున ఈశ్వరి జనించియుండును. ఆమె పుట్టిన 12 వత్సరములకు బ్రహ్మము సమాధియైనారు కావున 1687, 88 ప్రాంతము బ్రహ్మముగారి సమాధి కాలమగుచున్నది. ఇదియు మనము మొదటవేసికొన్న లెక్కకు సరిపోవుచున్నది. కనుక ఇప్పటికి నాకు దొరకిన అధారములనుబట్టి బ్రహ్మముగారు పదునేడవ శతాబ్దమున

మన్నారనియు, దాదాపు 1690 తో ఆయన జీవితము ముగియుచున్న దనియు నిర్ణయింప వీలైనది.

మొత్తముమీద బ్రహ్మముగారి యుగము మాత్రము ఆంధ్రదేశ చరిత్రలోనే గాక, భారతదేశచరిత్రలోగూడ ఒక ప్రత్యేకత గలదని నా యభిప్రాయము కారణమేమన, భారతదేశములోని వివిధ ప్రాంతములలో పలువురు మహాపురుషు లుదయించి భారతీయ సంస్కృతి నుద్ధరించుటకు కృషిచేసిన కాలమది. ఈ 17 వ శతాబ్ది మధ్యభాగముననే, మహారాష్ట్రములో శివాజీ చక్రవర్తి మహమ్మదీయుల దాడుల నరికట్టజూచినాడు. ఆయనకు గురుమూర్తులై సమర్థ రామదాసస్వామి — తుకా బ్రహ్మానందస్వాములు అధ్యాత్మవిద్యా ప్రచారము చేసినారు ఆ శతాబ్దపు టుత్తరభాగముననే కంచర్ల గోపన్న రామదాసుడై భక్తితత్త్వమును విస్తరింపజేసినాడు. అటు కన్నడదేశములోను పెక్కురు శైవసిద్ధు లుదయించి తత్త్వప్రచారము నొనర్చియున్నారు. ఈవిధముగా యావద్భారత దేశము ఆనాడు ఆధ్యాత్మిక తత్త్వపరిమళములతో గుబాళించిపోయినట్లు చరిత్ర చక్షువులకు గోచరించెడిని.

1952 డిసంబరు 'భారతి'నుండి పునర్ముద్రితము.

ఆచార్యులవారి యితర కృతులు

## 1. యోగదర్శనము. రు. 15/-

క్రొత్తగా వెలువడినది. నలుబది సంస్కృతాంధ్రాంగ్ల గ్రంథములలోని సారమును స్వానుభవ పరమార్థముతో మేళవించి, అనేక నూతనాంశములను చేర్చి వ్రాసిన 350 పుటల మహత్తర యోగశాస్త్రగ్రంథము.

ఇందు-ఉపక్రమము, జీవేశ్వర వివేకము, యోగ ప్రయోజనము, సాంఖ్య సిద్ధాంతము, ఆత్మజ్ఞానము, యోగ లక్ష్యము, మొదటి మెట్లు, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధారణా–ధ్యాన–సమాధులు, యోగ విఘ్నములు, అణిమాది సిద్ధులు, బుద్ధుని అష్టాంగమార్గము, అమనస్కయోగము, అమనస్కమహాసాధన, తాంత్రిక యోగము, కుండలినీ శక్తి, చక్ర రహస్యము, అక్షర రహస్యము, కొందఱు యోగసిద్ధులు–అను 22 ప్రకరణములలో తేలికభాషలో విషయ వివరణము చేయబడినది. సాధకులకు మిక్కిలిగా ఉపయోగించు గ్రంథము. కుండలినీశక్తి సహస్రార ప్రవేశము చేయు చిత్రముకూడకలదు. భారత ఉపరాష్ట్రపతి శ్రీ బి. డి. జట్టిగారు ఈ దర్శనమును ఘనముగా ప్రశంసించినారు.

## 2. శిల్పదర్శనము. రు. 12/-

డెబ్బది సంస్కృతాంధ్రాంగ్ల హిందీ గ్రంథములను సంప్రదించి వ్రాసిన మహత్తర గ్రంథరాజము; శిల్పతత్త్వమును, రహస్యములను ఎరుగగోరు ప్రతివారును చదివి తీరవలసినది. ఇందు-సృష్టి, రూపము, నామము, నామరూప విలాసము, శిల్పతత్త్వము, భావశిల్పము, వాఙ్మయ శిల్పము, రూపశిల్పము, స్థాపత్యవేదము, శిల్పబ్రహ్మలు, దేవాలయ

శిల్పము, ప్రతిమా లక్షణ సౌందర్యములు, లింగతత్త్వ స్వరూపాదులు, దేవతామూర్తి భేదములు, యంత్రశిల్పము, శిల్పము-వాస్తువు-కళ,వాస్తు విద్య, చిత్రశిల్పము, శిల్పము-లోకప్రవృత్తి, మనశిల్పసంపద. కొన్ని శిల్పాగమములు, కొందరు, శిల్పాచార్యులు - అను 22 అధ్యాయములు కలవు అంతమున 4 వందల శిల్పవాస్తు కళాతంత్ర గ్రంథముల పట్టిక చేర్పబడినది.

### 3. వీరరాఘవ వ్యాసావళి (సాహిత్య ఖండము-రు. 12-00)

ఇందు 24 సాహిత్యాంశములను గూర్చి సముచిత సమీక్ష చేయబడినది. ఆంధ్ర ప్రదేశసాహిత్య అకాడెమీవారి రెండువేల రూపాయల బహూకృతి నందిన కావ్యమీమాంస.

### 4. లేపాక్షి (చారిత్రక నవల-రు 6-00)

లేపాక్షి శిల్పములను, తన్నిర్మాతలైన శిల్పులను, విరుపణ్ణయొక్క త్యాగ కళామయ జీవితమును చిత్రించెడి నవల. మైసూరు, బెంగుళూరు, శ్రీ వెంకటేశ్వర, ఆంధ్ర, ఉస్మానియా, బరంపురం-విశ్వవిద్యాలయములు పఠనీయముచేసి గౌరవించి నట్టిది. పలువురు పండితులు, పత్రికలు ఘన ప్రశంసలు చేసిన దీనికి డా॥ వి. వి. ఎల్. నరసింహారావుగారు విపులమగు సమీక్ష వ్రాసినారు.

### 5. మోహనాంగి (నవల-రు. 5-00)

శ్రీకృష్ణదేవరాయల కూతురును: అళియ రామరాయల భార్యయు నగు తిరుమలంబా సతీమణి అద్భుత చరిత్ర. రాయల కాలమునకుచెందిన ఆంధ్ర కళా, సాంస్కృతిక, రాజకీయ సాంఘిక విషయములకు మణి

దర్పణము. శ్రీ వెంకటేశ్వర, ఉస్మానియా, బరంపుర విశ్వవిద్యాలయ ములు పఠనీయము చేసిన నవలా రాజము.

## 6. మిత్రసాహస్రి-రు. 10-00

"విశ్వహిత చరిత్ర, వినరమిత్ర" అను మకుటముతో వ్రాయ బడిన నీతి వేదాంతాది విషయములుగల వేయి పద్యముల గ్రంథము. జీవిత సంస్కారమును గోరు ప్రతివారును చదివి తీరవలసినట్టిది

## 7. శ్రీ వీరబ్రహ్మ సుప్రభాతమ్. రు. 2-00

ఇందు సుప్రభాతముతోపాటు వీరబ్రహ్మస్తోత్రము, వీరబ్రహ్మ మంగళాశాసనము, విశ్వకర్మాష్టకము, శిల్పిఋషిప్రార్థనాదులుకలవు. వీరబ్రహ్మేంద్ర మంత్రములు ధ్యానసహితముగా నున్నవి. ఈ కలి కాలమున సర్వులును చదివి ఐహిక, పారమార్థిక శ్రేయముల నంద వలసిన సద్గ్రంథము.

కావలసినవారు పుస్తకముల వెలలు M. O ద్వారా గ్రంథకర్త పేర గాంధినగర్ తెనాలి గుంటూరు జిల్లా అను చిరునామాకు పంపి నచో ఖర్చులతో V. P చేయబడును.